


### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-50. న.పై. అర్ధసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువమైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసము లందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

---

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్త్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగు ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౨౯]     సెప్టెంబరు 1957     [సంచిక ౯

# విషయసూచిక





—:o:—




దసరా బొమ్మలకొలువు




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# దసరా ఉత్సవములు

ఏటేటా వచ్చే దసరా పర్వదినములు యీ ఏడు సమీపానికి వచ్చినవి. దసరా ఉత్సవాలలో మాతృ స్వరూపిణీయైన త్రిపురసుందరిని లక్ష్మి, పార్వతి, సరస్వతి రూపాలలో దశరాత్రములు పూజాస్తోత్రములతో ఆరాధించుట పరిపాటి.

శక్తియనునది ప్రతియొక్కరికి ప్రతిపనికి అవసరము. కాబట్టి శక్తి స్వరూపిణిని ప్రతియొక్క దేశము ఏదో విధముగా ఆరాధించుచున్నది. దానినే మనం మన దేశములో పూజారాధనలతోటి, నూతనవస్త్రాభరణ అలంకారములతోటి, బొమ్మలకొలువులతోటి, దానధర్మములు, విందులతోటి వైభవోపేతంగా జరుపుతుంటాము.

దసరా ఉత్సవములు ఆబాలగోపాలమునకు సంతోషప్రదమైనవి. ముఖ్యంగా స్త్రీలకు, బాలికలకు, బాలురకు విశేషమైన పర్వదినము. బొమ్మలకొలువులద్వారా పసిపాపలకుసయితం భక్తిప్రబోధము, పరమాత్మ అవతారలీలలు విగ్రహములద్వారా జరుగుచున్నది. దసరా కొలువులనుచూచి ఆనందపరవశులగు ఆబాలగోపాలము కనులపండువుగానుండును.

హిందూ పర్వదినాలలో ప్రతియొక్కటీ పారమార్థికచింత ప్రతిఫలించు చుండును. అలాగే దసరా సమయంలో ప్రతిగృహంలో జరిగే అతిథిసత్కార ములు, విందులు, పేదసాదలకు దానధర్మములు పేర్కొనతగినవి.

విద్యార్థులు జయజయధ్వానములు చేయుచు ఊరేగుచుండుట యావత్ప్రపంచము సౌభాగ్యవంతంగా నుండాలని దేవతలు ఆశీర్వదిస్తున్నట్లు తోచును.

పరమేశ్వరి అను గ్రహామువలన యావత్ప్రపంచముతోబాటు మనదేశం సయితమ్ము శాంతి సౌభాగ్యములకు నిలయమయి అభ్యుదయ పురోగామికావాలని ప్రతియొక్కరు ప్రార్థనార్చనలు చేసి ఆమె సంపూర్ణానుగ్రహామునకు పాత్రులగుదురుగాక !

—o—

## విశ్వకళ్యాణ విజ్ఞాన విహార్

శ్రీమతి కనకదుర్గారామచంద్రన్, యం. ఏ. యం. ఇడి తమ తల్లిగారైన స్వర్గీయ యామినీపూర్ణ తిలకమ్మగారి స్మృతిచిహ్నంగా తాంబరంలో విశ్వకళ్యాణ విజ్ఞానవిహార్ ఏర్పాటుకుగాను జూలై నెల 7-వ తేదిన సమావేశ మేర్పాటుచేసిరి. సమావేశంలో పలువురు పెద్దలు, విద్యావేత్తలు పాల్గొని శ్రీమతి కనకదుర్గా రామచంద్రన్‌గారి కృషికి తోడ్పడునట్లుగా వాగ్దానముచేసిరి.

ఈ విజ్ఞానసమితి ఆదర్శలక్ష్యాలు విద్యా విజ్ఞాన వ్యాప్తికిగాను సమావేశముల నేర్పాటుచేయుట, వసుధైక కుటుంబ నిర్మాణమును ప్రోత్సహించుట, హిందూసాంస్కృతి సారస్వతముల ప్రచారముతోబాటు మాతాశిశు ఆరోగ్య వైద్యసలహాల నందించుట, లలితకళలను ప్రోత్సహించుట, బాలభటులకు, సేవాదళములకు వసతిప్రదేశముగా నుపకరించుట యిత్యాదులు.

ఈ సమితి నిర్మాణ సందర్భమున యామినీపూర్ణ తిలకమ్మగారి ఆశ్రమ ఆవరణలో ½ యకరం భూమిని భవన నిర్మాణమున కీయదలచిరి. అభిమానులు, ఉదారులు సహకరించి భవన నిర్మాణమునకు తోడ్పడి 'విశ్వకళ్యాణ విజ్ఞాన విహార్'ను ప్రజాహిత సంస్థలలో నొకటిగా రూపొందించగలరని ఆసిస్తున్నాము

ఈ సమితి కార్యకలాపములు జూలై 26-వ తేదిన స్వామి చిన్మయానందజీ ఉపనిషద్ ఉపన్యాసముతోటి, స్వాతంత్ర్య దినోత్సవముతోటి జరిగినవి.

# బిడ్డలు - తల్లిదండ్రులు

## క్రీడ

శ్రీ కె. వెంకట్రామయ్య.



రెండేండ్లనుండి ఆరేండ్లవరకు బిడ్డల కవసరమగు వివిధరకముల ఆటసామాగ్రుల గూర్చిన జాబితా గతసంచికలో కొంతవరకు నీయబడెను. తరువాయి జాబితా ఈ దిగువ నిచ్చుచున్నాము:—

గంపలు:—బిడ్డలు తామాడుకొను బ్లాకులను, బంతులను తీసికొనిపోవుటకు వీలుగా గంపలుండవలెను.

గుర్రపు ఆటకు:—కళ్లెముత్రాళ్లు ఉండవలెను.

పెంపుడు పిట్టలబల్ల, స్నానపుతొట్టె (Bird table and Bird bath):—

పనిచేయుబల్ల, పనిముట్లు, పనిముట్లనుంచుబోర్డు (Workbench and Tools and Tool Board):—

వీనిని పిల్లలు పెద్దల పరిశీలనలోనుండి వాడుచుండవలెను. 3 అ. వెడల్పు 4 అ. నుండి 6 అ. పొడవు 20 అం. ఎత్తుగలిగి కదలకయుండెడి దృఢమైనబెంచీ యుండవలెను. దానికి పట్టకారువంటి సాధనములు (Vices) అమర్చబడియుండవలెను.

ముఖ్యమగు పనిముట్లు:—పౌనుతేక అరపౌను బరువుగల సుత్తెలు. 12 అం. నుండి 18 అం. పొడవుగల రంపములు. ½ అం. నుండి 3 అం. పొడవుగల తీగమేకులు. మెత్తనిరకపుకఱ్ఱ. (Soft wood). దారపుబండ్లు. బొత్తముల మోల్డులు (Button moulds) మొదలగునవి ఉండవలెను. బిడ్డలు అనుభవమును బొందుచు, పనిముట్లను నేర్పుతో వాడుకొలది ఇతర రకముల రంపములను, చిత్రికగుల్ల మొదలగు పనిముట్లను ఈయవచ్చును. "మాదిరి" పనిముట్లనుగాక నిజమైనవానినే ఈయవలెను.

నటనా ప్రదర్శనపు టాటలకును, ఊహా ప్రదర్శనపు టాటలకును కావలసిన వస్తుసామాగ్రిలు. (Material required for Dramatic and Imaginative Play):—

మొదటి సెక్షనులో సూచించిన బోర్డులు, పెట్టెలు, ప్రెసిల్సు, ఇసుకతొట్టె, బ్లాకులు, కళ్లెముత్రాళ్లు, చక్రములుగల ఆటవస్తువులు నటనా ప్రదర్శనపు టాటలకు పనికివచ్చును,

డాల్ బొమ్మలతో నాడుట (Doll play):—బొమ్మలకు తగిన కుర్చీలు, బెంచీలు, టీసెట్టులు టెలీఫోన్, కుంపటి, త్రోపుడుబండి, మంచము, మొదలగునవియు, సులభముగా తొడిగితీయుటకు వీలగు బొమ్మల దుస్తులను ఉండవలెను. కుర్చీలు, టేబిల్లు బిడ్డలు వాడుటకు తగినంత పెద్దవిగా నుండవలెను. పడకపొడవు 2 నుండి 2½ అ. ఉండవలెను. పొయ్యి తదితరమగు ఇంటి సామాగ్రులు అక్కరలేని పెట్టెల తోను, వదలిన కర్రముక్కలు మొదలగు వానితోను చేయవచ్చును.

ఇంటిపనులకు జెందిన ఆటవస్తువులు (House keeping Toys):— చీపుళ్లు, తుడుపు గుడ్డలు, బూజుదులుపు కర్రలు.

లాండ్రీ ఆటవస్తువులు:— మాసిన బట్టలకు బుట్ట, టబ్బు లేక తొట్టె, ఇస్త్రీబోర్డు మొదలగునవి.

ఆట జంతువులు (Toy animals):—నోవాస్ ఆర్కు (Noah's Ark). ఇందు అన్ని జంతువులు ఉండును. పశువులు, కోళ్లు మొదలగునవిగల పెంపకపుదొడ్ల సెట్టులు (Farmyard Sets)

ఆటస్క్రీనులు (Play Screens):—నాటకశాలలు షాపులు మొదలగువానికి.

బట్టలపెట్టెకు:—చిన్న సూట్ కేసులు.

అంగడియాట ఆటవస్తువులు (Toys for Shop play):—త్రాసు, అట్టనాణెములు మొదలగునవి.

రవాణా ఆటవస్తువులు (Transport Toys):—పడవలు, రైళ్లు, విమానములు మొదలగునవి.

కట్టెడి యాటలకును, కల్పనా క్రీడలకును కావలసిన సామాగ్రిలు (Material for Constructive and Creative Play):—

నేర్పుతో తయారుచేయదగిన ఆటవస్తువులు (Manipulative Toys):—ఇంటిలో వృధాగానున్న టిన్నులు, అట్టపెట్టెలు, మొదలగునవి తపాలాపెట్టెలు, పెట్టెల దొంతరలు (Nest of boxes) తయారుచేయుటకు పనికివచ్చును. ఒక పలుచని కర్రపలకపైగాని, లావైన అట్టపైగాని బొమ్మల నంటించి రంపముతోకోసి జిగ్ సాపజిల్స్ తయారుచేయవచ్చును.

పోస్టుబాక్సు, పెగ్‌బోర్డులు (కొయ్యచీలలుగల బోర్డులు), హేమరుబోర్డులు:—

కలరుమాట్లు, పిరమిడ్లు, గోపురములు (Towers):—ఇవి సైజులందును రంగులందును క్రమానుసరణిని చేయబడిన ఘనములో, రింగులో కావచ్చును. ఇవి బోర్డునందలి పొడవైన కొయ్యచీలల కమర్చుటకు వీలుగా నుండును.

ఇన్‌సెట్టులు (Insets), బొమ్మల పజిల్సు ఒక దానితో నొకటి తగిలింపగల ట్రైనులు (Interlocking trains); కొక్కెములతో తగిలింపగల ట్రైనులు (Hook-on-Trains), స్క్రూబోల్టు; ఏకో

ప్లేను, లారీ, వంటి రవాణా ఆటవస్తువులు (భాగములు విడదీయుటకు వీలగునవి); మొజైక్ పలకలు (Mosaic Tablets); ట్రాలీలు (Pegand Block Trolleys); దారమునకు గ్రుచ్చుటకు వీలగు దారపు బండ్లు, కర్రఘనములు (ఒక అం. ప్రక్క కొలతగలవి.)

**ఘనములు** (Blocks):—వీనిని ఇంటియందు అక్కరలేని పెట్టెలు తదితర వస్తువులతో చేయవచ్చును. ఒకే విధముగ, సరిగా కోయబడిన ఘనములుండుట మంచిది. వాని సైజులు ఒక ప్రమాణమునకు గుణిజములై యుండవలెను. రెండు, మూడేండ్లబిడ్డలు క్రిందికొలతలుగల బోలు ఘనములతో (Hollow blocks) వాడుట కిష్టపడుదురు.

**5½ అం. × 5½ అం. × 5½ అం.; 11 అం. × 5½ అం: × 5½ అం. ఘనములు.**

మూడేండ్లనుండి ఆరేండ్ల వయసుబిడ్డ లాడుటకు తగిన ఘనములు (బోలువిగాని గట్టివిగాని కావచ్చును.)

| బ్లాకులు | ఒక బిడ్డకు | 10 మందికి |
|---|---|---|
| ఒక యూనిట్టు కొలతవి - 5½ అం × 2¾ అం × 1 3/8 అం | 50 బ్లాకులు | 100 బ్లా |
| రెండు యూనిట్ల కొలతవి - 11 అం. × 2¾ అం × 1 3/8 అం | 20 ,, | 100 ,, |
| నాలుగు ,, ,, - 22 అం. × 2¾ అం × 1 3/8 అం | 20 ,, | 24 ,, |
| Large Ramp (మదురు) 11 అం. × 2¾ అం × 1 3/8 అం | 6 ,, | 15 ,, |
| స్తంభములు (Pillars) 5½ అం. × 1 3/8 అం × 1 3/8 అం | 8 ,, | 20 ,, |
| సిలిండర్లు 2¾ అం. వ్యాసము 5½ అం పొడవుగలవి | 8 ,, | 20 ,, |
| విల్లువంపు ఘనములు 10 అం. పొడవుగలవి | 6 ,, | 20 ,, |
| స్విచ్చీలు (Switches) 13 అం. ,, (బండ్లను ఒక దారినుండి మరియొక దారికి తప్పించునవి) | 6 ,, | 20 ,, |

## డ్రాయింగు, పెయింటింగు, వ్రేలిపెయింటింగులకు కావలసిన వస్తువులు (Drawing, Painting, Finger-painting Materials):—

పెద్ద క్రేయనులు (Crayons) ½ అం. నుండి ¾ అం. వ్యాసముగలవి; 12 అం × 18 అం. కొలతలుగల పెద్దసైజు కాగితపుషీట్లు. (9 అం × 12 అం. సైజునకు తక్కువవి యుండరాదు) - గోధుమ రంగు కాగితము, అచ్చువత్తని న్యూసుపేపరు పనికివచ్చును.

రంగువేయుటకు చిన్నరంగు పెట్టెలను (పెయింటు బాక్సులను) వాడుటకంటె చన్నీట రంగుపొడిని కలిపి ధారాళముగా వాడుట మంచిది. విషములేని రంగులనే వాడవలెను. గోడలపై అంటించు పోస్టర్లకు వాడెడి రంగుపొడిని వాడుట మంచిది. స్టార్చినిగాని, జొన్న, బియ్యము మొదలగువాని పిండినిగాని చన్నీటితో మొదట క్రీముగాకలిపి దానికి కావలసిన చిక్కదనముండునట్లు వేడినీరు కలుపవలెను. పిదప దానిలో నము నీటకలిపిన ఒకటే స్పూను రంగుపొడిని కలుపవలయును. అప్పుడా రంగు పైయింటింగున కెంతయు

పైదానినే కొంచము చిక్కని ద్రావణముగ తయారుచేసినయెడల వ్రేళ్లతో రంగువేయుటకు బాగుండును. బ్రష్షులపుల్లలు పొడవుగా నుండవలెను. కుంచెలు పెద్దవిగా నుండవలెను.

ఈ సెల్సు (చిత్తరువుల వ్రాయుట కుపయోగించెడి ఏటవాలు బల్లలు) రెండు ప్రక్కలుగలవి కావలెను. వీనిని ఇంటివద్దనే తయారుచేయవచ్చును. వీని సైజులు దిగువనిచ్చిన కొలతలను గలిగియుండవలెను.

మొత్తము వెడల్పు 2 అ. 2 అం. మొత్తముఎత్తు 3 అ. 3¼ అం. ఉండవలెను. తేలికకర్రపలకలు (ప్లైవుడ్) 20 అం × 26 అం. కొలతలుగలవి బోర్డులకు కావలెను. (రెండు ప్రక్కలుగల ఈ సెల్సుకు ఇట్టివి రెండు పలకలు కావలెను); ఈ పలకలను నిలువబెట్టు కర్రలకొలతలు 2 అం × 7/8 అం. వెడల్పు అడ్డకొలత; బేసు లేక భూమి దగ్గర వెడల్పు 1 అ. 8½ అం. డ్రాయింగుబోర్డు మధ్య భాగము బిడ్డకంటిఎత్తున నుండవలెను.

గోడలకుగాని తడకలకుగాని కొక్కెములను తగిలించి వాలుగా నిలువబెట్టుటకు వీలగునట్లుగూడ ఈ సెల్సును తయారుచేయవచ్చును. బోర్డు అడుగున సన్నని పలకనుచేర్చి బిగించినచో దానిపై రంగుపాత్రల నుంచుకొనవచ్చును. లేనియెడల దానిని దగ్గరనున్న టేబిలుపై పెట్టుకొనవచ్చును.

కత్తెర:- నాలుగైదేండ్ల బిడ్డలకు మొద్దుమొనలుగల కత్తెరల నీయవచ్చును.

### బొమ్మలను తయారుచేయుటకు కావలసిన వస్తువులు (Material For Modelling):-

బొమ్మలను తయారుచేయుట కవసరమగు బంకమట్టి (Artists' or potters' modelling Clay) బజారులలో పొడిగా (పొడరుగా) దొరకును. దానికి తగిన నీరు కలిపి కావలసిన విధమున తయారుచేసికొనవచ్చును. కొన్నిస్థలములలో దొరకు జిగటమన్నుగూడ బొమ్మలను చేయుటకై వాడవచ్చును. బంకమట్టిని వాడనప్పుడు, తడిగుడ్డలోచుట్టి గాలిచొరని డబ్బాలోగాని మట్టిపాత్రలోగాని ఉంచవలెను.

గోధుమ పిండిలో స్వల్పవంతు ఉప్పునుకలిపి తయారుచేసిన ముద్దనుగూడ బొమ్మలకై వాడవచ్చును. ఈ ముద్దను గాలిచొరని జాడీలో నుంచిన యెడల కొన్ని దినములు నిలువయుండును.

బొమ్మలను తయారుచేయుటకై ఉపయోగించెడి టేబిలుపైన కాన్వాసుగుడ్డనో, ఆయిలుక్లాతునో న్యూసుపేపరునో పరచవలెను. ఒక్కొక్కప్పుడు "క్లేబోర్డు"నుగూడ ఉపయోగించవచ్చును. మోడలింగు పనిచేయునప్పుడు దుస్తులు పాడుగాకుండ బిడ్డ ఒక గుడ్డను ముందుకట్టుకొనుట మంచిది.



# అంధులకు చదువులు చెప్పే అంధవనిత



అంధులకు అంధులే నాయకత్వం వహించగలరనడానికి తన జీవితమే ఒక నిదర్శనమని అంధమహిళ కుమారి లూసీ కొరిగన్ ఎంతో గర్విస్తుంటుంది. ఆమె పూర్తిగా గ్రుడ్డిది. అంధులైన తన సోదర మానవులకు ఒక ఉపాధ్యాయినిగా, స్నేహితురాలిగా, ఉజ్వలజ్యోతిగా ఆమె తన జీవితాన్ని అంకితాన్ని చేసింది.'

"అంధులు తోడి అంధులనుంచి సహాయంపొందడంలో ఎక్కువ భద్రంగా ఉన్నట్టు భావిస్తారు. అందుచేత గ్రుడ్డివారితో కలసి మెలసి ఎక్కువ విజయవంతంగా కృషి చెయ్యగలనని నా నమ్మకం." అని ఈ స్వేచ్ఛాజీవి కొరిగన్ అంటూ ంటుంది. ఎక్కడికయినా ప్రయాణం చెయ్యవలసినప్పుడు మాత్రం ఇంకొకరి తోడ్పాటు అవసరంగాని, ఇల్లు చక్కబెట్టుకోవటం, వంట మొదలైన గృహకృత్యాలన్ని ఆమే స్వయంగా నిర్వహించుకుంటుంది.

అంధులకు బోధించే పద్ధతులలో ఆమె కొలంబియా విశ్వవిద్యాలయంలో ప్రత్యేక శిక్షణపొంది, ఉపాధ్యాయినిగానే తన జీవితాన్ని గడుపుతున్నది. అంధుల కోసం స్థాపించిన అమెరికన్ ఫౌండేషన్ లోనూ, అటు తర్వాత సాంఘిక సేవా వ్యవస్థలోనూ, పిల్లల సహాయార్థం స్థాపించిన సమితిలోనూ, అధికారిగా పనిచేసి తాను నేర్చుకున్న విద్యను ఆచరణ రూపంలో పెట్టి కృతార్థురాలయింది.

ప్రస్తుతం లూసీ కొరిగన్ అంధుల కోసం ఏర్పడిన "బ్రూక్‌లిన్ ఎక్స్ఛేంజిలో" ఉద్యోగం నిర్వహిస్తున్నది. తమతమ స్వస్థలాలకు తిరిగివెళ్లే గుడ్డివారికి సహాయం చేయడం, గ్రుడ్డివారికోసం ఏర్పాటయిన కేంద్రాలలోని సమష్టి కార్యక్రమాలలో పాల్గొనేవారికి తగిన శిక్షను నివ్వడం ఈమె ఉద్యోగవిధులు.

నాలుగు అయిదు గృహాలకు వెళ్లి అక్కడున్న గ్రుడ్డివారికి ఇల్లు సర్దుకోవడం బ్రెయిలీభాష (అంటే అంధులు వ్రాయడం, చదవడంకోసం ఏర్పడిన ప్రత్యేక సంజ్ఞలభాష)లో బోధించడం; జీవనోపాధి కోసంగాని, తీరుబడి సమయాల్లో సరదాగా గాని చేసుకునేందుకు వీలుగా సులువైన గృహపరిశ్రమనొకదాన్ని నేర్పడంవంటి పనులుకూడా ఈమె సాధారణంగా ప్రతి రోజు చేస్తూంటుంది.

అంధులకుగాను కేథలిక్ మహిళల సంఘం స్థాపించిన నివాసమందిరం "ఆన్‌తోనియన్ హాల్"ను ఈమె సందర్శిస్తూంటుంది. ఇక్కడ వర్గ విచక్షణ లేకుండా గ్రుడ్డివారందిరికీ సమాన సదుపాయాలు సమకూరుస్తారు. నేతపని, గుడ్డ పీలికలతో బొమ్మలు కుట్టడం, వంట మొదలైన వాటిని ఈమె అక్కడ నివసిస్తున్న 40 మందికి నేర్పుతుంది; బ్రెయిలీభాషా తరగుతులు నిర్వహిస్తుంది. టైప్‌రైటింగ్ నేర్పిస్తుంది. ఈవిధంగా టైప్ రైటింగ్ నేర్చుకున్న ఈమె శిష్యులు సరదాతో పాటు సంపాదనాపరులుగా కూడ తయారయారు.

సామాజిక జీవితంలోకూడ కుమారి కొరిగన్ ఒక కాంతి కణంలాగ మెరుస్తుంటుంది. పియానోవాయించడం, నాట్యాలు, గోష్ఠి కార్యక్రమాల్లో చొరవ తీసుకోవడంలో ఈమె అందెవేసినచెయ్యి.

అంధ యువతీ యువకులకు వృత్తి విద్యలు నేర్పి, ఉపాధులు కల్పించే "బ్రూక్ లిన్ ఎక్స్‌చేంజి" వ్యవస్థలో పనిచేసేటందుకు, ఈమె ప్రతిరోజూ పరుగెత్తుతూ ఉంటుంది. ఈమె అలసట అనేది ఎరుగని కష్టజీవి. ఇన్ని సహాయ కార్యక్రమాలతో పాటు పసిపాపల విద్యావిషయక కార్యక్రమాల్లోనూ, ఆటపాటల్లోనూ పాల్గొంటు ఉంటుంది.

పిల్లలను, బ్రెయిలీభాష చదవడం, వ్రాయడంలోను; టైప్ రైటింగ్ నేర్చుకొనడంలోను; కళలు, పరిశ్రమల్లో పాటవం సంపాదించడంలో, సరియైన మార్గంలో పెట్టడం; వాళ్ళ సంగీతోత్సవాలలో పియానోవాయించడం! వాళ్ళకి వినోదానిచ్చే కార్యక్రమాలు ఏర్పాటు చేయడం; వారి దృష్టిలోపంవల్ల కలిగే ఇబ్బందులను సునాయాసంగా పోగొట్టుకోగలమన్న ఆత్మవిశ్వాశాన్ని వాళ్లకు కల్గించడం మొదలైన కార్యాలలో కుమారి లూసీ కొరిగన్ తన జీవితాన్ని ధారపోస్తున్నది.



# క్షమాపణ

శ్రీ నాయుడు వెంకట సీతారామమూర్తి

సుశీల కాలేజీలో బి. ఏ. చదువుతోంది. క్లాస్ మేట్ సత్యం సుశీలకు దగ్గర బంధువు. ఆ నాలుగేళ్ల కాలేజీ జీవితంలోనూ యిద్దరూ అత్యంత సన్నిహితులయ్యారు.

పరీక్షలు ముగిశాయి.

శలవలకు యిద్దరూ స్వగ్రామానికి వచ్చేశారు. సుశీలను సత్యానికిచ్చి వివాహం చేయాలని సుశీల తల్లి తండ్రుల సంకల్పం. సుశీల సత్యాన్ని గాఢంగా ప్రేమించింది.

ఒకనాడు—

సుశీల, సత్యం యిద్దరూ బీచికి షికారుకు వెళ్లారు.

సంధ్యా సమయం.

ఆ రోజుకు తన బాధ్యత తీరినట్టు భానుడు సముద్ర గర్భంలో దాక్కుంటున్నాడు.

హోరున సముద్ర కెరటాల ధ్వని.

చల్లనిగాలి మెల్లగ వీస్తున్నది.

సముద్ర కెరటాలు దోబూచులాడుకుంటూ సుశీల పాదాలకు చక్కిలిగింతలు పెడ్తున్నాయి.

సత్యం పరధ్యాన్నంగా ఉన్నాడు.

తన హృదయాన్ని విప్పిచెప్పాలనుకుంది సుశీల.

"సత్యం!" అని పలుకరించింది.

సమాధానం లేదు.

"ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టున్నావ్!"

"ఏమీ లేదు."

"నిన్నో విషయం అడగాలి."

"అడుగు."

"మన పెళ్ళి విషయం ఆలోచించేవా?"

"లేదు."

"యిద్దరం ఏదో ఒక నిర్ణయానికి రావాలిగా!"

"నీవు నిర్ణయించుకున్నావా?"

"ఆ"

"ఏమని?"

"నిన్నే పెళ్ళిచేసుకోవాలని."

"మంచి ఆలోచనే."

"నీ ఉద్దేశం?"

"అదే ఆలోచిస్తున్నాను."

"ఇష్టం లేదా?"

"ఎంత అమాయకురాలివి సుశీలా?"

"చిన్నప్పటినుంచీ కలసి మెలసి ఉన్నాం. ఒకరి హృదయాన్ని ఒకరు అర్థంచేసుకోగలిగేం."

"అదే పొరపాటు."

"పొరపాటా?"

"అవును. నా హృదయాన్ని నీవు పూర్తిగా అర్థంచేసుకోలేదు."

"చేసుకున్నాను."

"చేసుకుంటే యిట్లా మాట్లాడవు. నన్ను అర్థం చేసుకున్నానని అపోహపడుతున్నావు. కానీ నాలోని భావాలు నీకు పూర్తిగా తెలీవు."

"ఎందుకని?"

"తర్వాత చెప్తాను."

"దేన్ని గురించో ఆలోచిస్తున్నట్టున్నావు. నాతో చెప్పకూడదా !"

"కూడదని కాదు. చెప్తే నీవూ బాధపడతావు."

"పర్వాలేదు చెప్పు."

"ఈ వేళ ఆంధ్రపత్రికలో ఉషశ్రీ కథానిక చదివేను. దానిలోని విషాద సంఘటన జ్ఞప్తికి వచ్చింది."

"ఏమిటది ?"

"ఒక యువతి ఒక యువకుణ్ణి ప్రేమించింది."

"కథల్లో అది మామూలే."

"యువకుడు మాత్రం ప్రేమించలేదు."

"అమ్మాయి అందంగా లేదనా ?"

"కాదు. తన హోదాకి సరిసమానంగా లేదని."

"ఆ విషయం అమ్మాయితో చెప్పేడా ?"

"లేదు. కానీ ఆ అమ్మాయి రూపురేఖల్ని చూచి మురిసిపోయాడు. ఒకనాటి వాతావరణం అతనిలో ఉన్న దుష్టశక్తుల్ని విజృంభింపజేసింది. కామోద్రేకంతో కళ్లుగానక ఆ యువతిని అనుభవించేడు."

"ఆమె అంగీకరించిందా ?"

"ఏం చేస్తుంది ? అబల. పెళ్ళి చేసుకుంటానని నమ్మించేడు. తన కామవాంఛ తీర్చుకోడానికి ప్రయత్నించేడు. అమ్మాయి అంగీకరించలేదు. చివరకు బలాత్కారం చేసి తన కోర్కెను తీర్చుకున్నాడు."

"ఎంత దారుణం !"

"పాపం ! ఆ కన్యకు ఆరో నెల. తల్లి తండ్రులు ఆమెను గెంటివేశారు. సంఘం ఆమెను బహిష్కరించింది. ఆమె యిప్పుడు అనాథ. ఏ కాకి ఒంటరిగా పూరిగుడిసెలో కాలంగడుపుతోంది."

"ఛీ ! ఆ దుర్మార్గుణ్ణి నిలువునా కాల్చివేసినా పాపం లేదు. నేనే అయితే -"

"ఏం చేద్దువు ?"

"తగిన రీతిగా బుద్ధి చెపుదును."

"బుద్ధి రాకపోతే ?"

"సంఘంలో యిటువంటి చీడపురుగులు ఉండకూడదని హత్యచేసైనా, కసి తీర్చుకుందును."

"అయితే కానియ్యి. నన్ను చంపు."

"నిన్నా ?"

"అవును. ఆశ్చర్యపడకు సుశీలా ! ఆ కన్య శీలాన్ని దోచుకున్న దుర్మార్గుణ్ణి నేనే."

"ఎంతపని చేశావ్ !"

"అందుకనే నా హృదయాన్ని పూర్తిగా అర్థం చేసుకోలేదన్నాను."

"ఎంత అన్యాయం !"

"నన్ను మన్నించు సుశీలా. నా నేరానికి ఏదైనా సరే శిక్ష విధించు. అనుభవిస్తాను."

"మన్నించేది నేను కాదు. తిన్నగా వెళ్ళి ఆ యువతి కాళ్లమీద పడి మన్నించమని కోరు. ఆమెను నీ అర్థాంగిగా స్వీకరించు."

సత్యం నిర్ఘాంతపోయాడు.



# మహిళలు

శ్రీమతి తెన్నేటి హేమలత



ఈ నాడు మన స్వాతంత్ర్య దినోత్సవమే కాక స్వాతంత్ర్య ఉద్యమ శతోత్సవము కూడాను. స్వాతంత్ర్యముకొరకు నూరేండ్లనాడు ఒక విప్లవము ప్రారంభించబడ్డది. అందులో ముఖ్యముగా చెప్పుకోతగ్గవారు ఝాన్సీ లక్ష్మీబాయి. కాని అప్పటి ఉద్యమము జయప్రదం కాలేదు. మరల మహాత్మగాంధీ నాయకత్వాన వేలాది స్త్రీలు, పురుషులు శాంతి పద్ధతులలో చేసిన కృషి ఫలితంగా మనకు స్వాతంత్ర్యము లభించింది.

వీరందరూ దేన్ని కాంక్షించి తమ జీవితాన్ని ఈ హోమాగ్నికింద సాలుగా అర్పించారో, మనము దాన్ని ఎంతవరకు సాధించేమో అని ఈ నాడు సింహావలోకనం చేసుకోవలసిఉంది.

మనకొక రాజ్యాంగం ఏర్పడ్డది. తద్వారా మన పురోగమనానికి కావలసిన ఏర్పాట్లు చేసుకున్నాం. జాతిమత స్త్రీ పురుష భేదాలులేకుండా సమాన హక్కులు లభించాయి. స్త్రీలకు రాజకీయాలలోనే గాక అన్ని రంగాలలోనూ సమాన హక్కులు లభించాయి. చిరకాలంగా వెనుకబడి యుండిన స్త్రీలనుద్ధరించుటకై మన నాయకులెంతయో శ్రమపడి అనేక పథకాలేర్పరిచారు. గ్రామ పంచాయితీల నుండి కేంద్ర ప్రభుత్వం వరకుకూడా ప్రాతినిధ్యంలభించింది. శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ ప్రపంచంలోకల్లా ప్రథమ నారీ రాయబారిగా ఉన్నందుకు మనమెంత గర్వపడాలో, ప్రతి పంచాయితీలోను స్త్రీలు ప్రతినిధులుగా ఉన్నందుకు మనమంతసంతోషపడాలి. ఇంటి బయటికి వచ్చి యితరులతో మాట్లాడేందుకు సందేహించే స్త్రీలు ఈనాడు తమ గ్రామ పంచాయితీల నిర్వహణలో పాత్రవహించుచున్నారు. మన రాష్ట్రంలో అనేక గ్రామాలలో పంచాయితీ అధ్యక్షురాండ్రుగా కూడా ఉన్నారు. నెల్లూరు జిల్లాలోని వవ్వేరు గ్రామ పంచాయితీ మెంబర్లందరూ స్త్రీలే ఎన్నుకోబడ్డందుకు ఈగ్రామం చారిత్రాత్మకమైంది.

స్త్రీ ప్రాతినిధ్యం లభించిన కారణంగా తమకుకావలసిన సంస్కరణలు జరుగుతున్నాయి. కడకు మరుగు స్థలాలవంటి ముఖ్యావసరాలుకూడా లేనందున గ్రామ జీవితం దుర్భరంగా ఉండేది. ఇప్పుడో స్త్రీ సంక్షేమ సంస్థలద్వారా జాతీయ విస్తరణ కేంద్రాలద్వారానూ, జాతీయ వికాసముకలిగి గ్రామాలకు వెలుగు వచ్చింది. ప్రసూతి కేంద్రాలనేకం ఏర్పడ్డాయి.

జీవితేచ్ఛ లేక బానిసలుగాను, దీనులుగాను జీవించే అనేక అనాథస్త్రీలకు వెలుగుచూపిస్తూ ఎండిపోయిన వారి జీవితాలను చిగురింప జేయడానికనేక పథకాలేర్పడ్డాయి. గృహపరిశ్రమలు, చేతిపనులు నేర్పుతూ, కొంత ఆర్థిక స్వాతంత్ర్యము కలిగిస్తున్నారు. ఈ సంస్థల నిర్వహణల కొఱకు అనేక స్త్రీలను ఉద్యోగులుగా నియమిస్తున్నారు. గ్రామ సేవికలుగాను, పరిశ్రమోపాధ్యాయినులుగాను, నర్సులుగాను, మంత్రసానులుగాను టీచర్లుగాను అనేక స్త్రీలు పనిచేస్తూ దేశకల్యాణమునకు తోడ్పడుతున్నారు. అంతే కాక పిల్లలు వంటిల్లు తప్ప యింకేలాటి ప్రపంచ జ్ఞానములేక కూపస్థ మండూకములవలె జీవించే అనేకమంది గ్రామ మహిళలకు ఆటలు పాటలు నేర్పి పుణ్యకథల కాలక్షేపాలు జరిపి వారికి విజ్ఞాన వికాసాలు కల్పిస్తున్నారు. పతితులైన స్త్రీలనుద్ధరించి వారు గౌరవ ప్రదమైన జీవితం గడిపే లాగుచేస్తున్నారు. శాసనం ద్వారా సమాన ఆస్తిహక్కు లేర్పడ్డాయి. బహు భార్యా నిషేధ చట్టమువల్ల పురుషులు, స్త్రీల నాటవస్తువులుగా గాక గౌరవముగా చూచేపరిస్థితి ఏర్పడ్డది.

(ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రం

(సౌజన్యంతో ...

P. I. B.

---

# నేత్ర వ్యాధులకు కొత్త చికిత్స

గత ఏడాది కుర్స్క్ రైల్వే కార్మిక ఆస్పత్రిలోని డాక్టర్లు "నరోద్నికిటల్" (ప్రజాచైనా) అనే పత్రికలో నేత్రవ్యాధులకు ఒక కొత్త చికిత్సా పద్ధతిని గురించి చదివారు. షార్టుసైట్ (దూరపువస్తువులు కనుపించకపోవడం), లాంగ్ సైట్ (దగ్గరి వస్తువులు కనుపించక పోవడం), ఏస్టిగ్మాటిజమ్ అనే వ్యాధులను బలహీనమైన విద్యుత్ ప్రవాహం సాయంతో చికిత్సచేసే కొత్త పద్ధతిని చైనాడాక్టర్లు పరిక్షిస్తున్నారని అందులో తెలుపబడింది.

చైనా డాక్టర్ల పద్ధతిలో కొన్నిమార్పులుచేసి కుర్స్క్ డాక్టర్లు, కంటిపై రెప్పలోనికి విద్యుచ్ఛక్తిని ప్రవహింప జేయడంద్వారా కొన్ని నేత్రరోగాలను కుదర్చడం ఆరంభించారు. ఈ చికిత్సా పద్ధతిని రోగులమీద ప్రయోగించడానికి ముందు, షార్టు సైటువల్ల 40 ఏళ్ళనుండి కళ్ళజోడు పెట్టుకుంటున్న యీ ఆస్పత్రి ప్రధానవైద్యుడు ఎస్. పొలికార్పోవ్ దానిని తనమీదనే ప్రయోగించుకున్నాడు. ఆయన దృష్టిబాగుపడి, మరి కళ్లజోడు అవసరంలేకపోయింది. ఇప్పుడు కుర్స్క్ ఆస్పత్రిలో 15 మంది రోగులు అటువంటి చికిత్సతీసుకుని మామూలు దృష్టిని పొందేరు.

ఈ కొత్త చికిత్సాపద్ధతిని కనుగొనడం వైద్యశాస్త్రంలో ఒక నూతన విజయమని ప్రవీణుల అభిప్రాయం. దీనిని ప్రయోగించినట్లయితే లక్షలాది రోగుల దీర్ఘ, హ్రస్వ దృష్టిదోషాలనూ, తదితర నేత్ర వ్యాధులను కుదర్చవచ్చును.

'టాస్'

# అదృష్టమంటే

'ప్రమద'

కృష్ణమూర్తి మా లాడ్జి ఎదురుగ ఉన్న ఇంటివా రమ్మాయిని ప్రేమించాడన్న సంగతి లాడ్జి అంతా గుప్పుమంది. మూర్తి అంటే సామాన్యుడా? బి. ఎస్. సి రెండవ సంవత్సరము చదువుతున్న ధీరుడు. మిత్రు లందరము పరామర్శించటానికి మూర్తి రూముకు వెళ్ళాము. మాసిన చొక్కా, మాసిన లుంగీ, మాసిన గడ్డము, గుర్తుపట్టలేనంతగ మారిపోయాడు.

"చెప్పురా నాన్న! చెప్పు అసలు ఎలా చూశావు ఆ అమ్మాయిని!" రాజు సిగిరెట్టుపొగ పీలుస్తూ అడిగాడు.

ఇది పూర్తి కాకుండానె బైరాగి మరో ప్రశ్న వేశాడు.

"అసలు ఆ అమ్మాయి పేరేమిటి?"

మూర్తి మాట్లాడలేదు అర్ధనిమీలితనేత్రుడై అలాగే కూర్చున్నాడు.

"పోని ఎప్పటినించి నీకీ విరహ జ్వరము ప్రారంభించిందో చెప్పేవుకాదు" అని రాజు సిగిరెట్టు అవతల పారేశాడు.

మూర్తి అప్పటికీ మాట్లాడలేదు.

"నువ్వు చెప్పకపోతే నేను కనుక్కోలేనూ!" అన్నాడు డిటెక్టివ్ అని చెప్పుకుంటున్న జగం.

మేమంతా జగ్గువైపు చూశాము. పకకుర్చీలోంచి లేచాడు. సిగిరెట్టు ముట్టించాడు. గబగబ మూర్తి పుస్తకాలవైపు చూశాడు. కానేపు అక్కడేదో చూశాడు. వెంటనే ఓ గెంతు గెంతాడు.

"ఆ! ఆ అమ్మాయిపేరు రాధ. అవునా?" అన్నాడు మూర్తివైపుచూసి.

మూర్తి అవునన్నట్టు తల ఊపాడు.

"ఇకనైనా నేను పెద్ద డిటెక్టివ్ అని ఒప్పుకుంటారా?" అన్నాడు.

మా అందరికి ఆశ్చర్యమేసింది. ఎందుకంటే-వకీలు కామేశంగారు వచ్చి ఇంకా వారం రోజులుకాలేదు. ఆ అమ్మాయిని వీడు ఎలాచూసి ప్రేమించేశాడో తెలియలేదు.

"అదీ నేను కనుక్కుంటాను" అన్నాడు జగ్గు.

"ఏది?" బైరాగి రోగిలాగ ప్రశ్నించాడు.

"అదే! ఎలా ప్రేమించాడో?"

"సరే. కనుక్కో." మేమంతా వెళ్ళిపోయాము.

తరువాత మర్నాడు ఆదివారము. మాకు శలవ. మధ్యాహ్నపువూట కూర్చుని సీక్వెన్సు ఆడుతున్నాము. జగం అమాంతం మా మధ్యలోకి దూకాడు. "కనుక్కున్నానురా" అన్నాడు.

"ఎలాగో చెప్పు?" ఆట ఆగిపోయింది.

జగ్గు సిగిరెట్టు ముట్టించాడు.

"వినండి! నాలుగు రోజుల క్రిందట మనవాడు స్నానంచేసి బాత్‌రూమునుంచి వస్తున్నాట్ట. వాడి కళ్ళకు ఆ అమ్మాయి కనపడ్డది. ఇంకేముంది కిందబడ్డంత పనిఅయి (పడే ఉంటాడు) ఆ అమ్మాయి స్వరూపాన్ని తన మనస్సులో గాఢంగ హత్తుకుపోయేటట్టు చిత్రీకరించాట్ట. ఇక చూసుకో, వాడికి ప్రారంభమయింది విరహ జ్వరము." జగ్గు పూర్తి చేశాడు.

"అసలు వాడికి మార్కులేమి వస్తయి? మనకు నెక్సువీక్ పరీక్షలు." రాజు తెలివి వెలగబెట్టాడు.

"ఉండ్రా! నీ దొక గొడవ." పరీక్షలంటే భయపడే బైరాగి కసురుకున్నాడు.

"ఒరే, మనమంతా ఓ పనిచేస్తే" జగం సీరియస్‌గ మాట్లాడేడు.

'ఏమి'టన్నట్లుగ వాడివైపు తలలు తిరిగాయి.

"ఏంలేదు; వాడిని పరీక్షలుదాకా చదవమందాము. తరువాత ఆలోచించవచ్చు!" జగం అయిడియా అందరకు నచ్చింది.

ఆ మాట మూర్తికి చెప్పేము. ఏమనుకున్నాడో ఆరోజునుంచి సీరియస్‌గా చదివాడు. అసలు మూర్తికి ఎప్పుడు మంచి మార్కులు వస్తుండేవి. సాధారణంగ ఫస్టుక్లాసులోనే పేసవుతుండేవాడు.

పదిహేను రోజులు గడిచిపోయినయి అతికష్టము మీద. ఆ రోజు రాత్రి ఫస్టుషో సినిమాకెళ్ళి పదింటికి లాడ్జికొచ్చి మూర్తిని కలుసుకున్నాము. రూము కిటికిదగ్గర కుర్చీ వేసుకుని, చెంపకు చెయ్యి ఆనిచ్చి పెట్టుకుని 'ఆగ్ తెరహో'లోని రాజకపూర్ ఫీలింగు ఇచ్చి కూర్చున్నాడు మూర్తి.

"ఓ కృష్ణ, ఏ రాధ దగ్గర ఉన్నావు? ఇటు చూడు." అన్న సుబ్బారావు మాటవిని ఉలిక్కి పడ్డాడు.

మమ్మల్ని చూడగానె బావురుమని ఏడ్చాడు. రాజు వాడిని కావలించుకుని ఓదార్చి తన స్నేహితాన్ని హావభావ చేష్టలతో నేర్పుగ కనపరిచాడు.

"ఆహా! స్నేహమంటె ఇది!" బైరాగి ఆశ్చర్యపడిపోయాడు.

"ఒరే! చూడరా! నిన్న సాయంత్రము రాధ గాంధిపార్కుకు వచ్చింది. దగ్గరకెళ్ళి..." మూర్తి ఆగాడు.

"ఆ! చెప్పు" రాజుగాడు మంచి ఛాన్సు పోయిందే అన్నట్లు విచారంగ చూస్తున్నాడు.

"మీరు చెప్పినట్లే ప్రేమిస్తున్నానని చెప్పాను." అన్నాడు మూర్తి దీనంగా.

"ఊ! తరవాత ఏముంది?" సుబ్బారావుప్రశ్న.

"ఏముంది, ఎడమచేత్తో చెంపపగిలేట్టు ఒకటి కొట్టింది. ఇక ఈ పిచ్చివేషాలు మాని మీ చదువేదో మీరు చూసుకోండి. నా జోలికిరావద్దు. ఇంకానయం లెంపకాయతో పోనిచ్చాను. మానాన్న గారికిచెప్తాను ఇకమీదట ఇట్లాంటి వెధవపనులు చేస్తే -;" అంది అన్నాడు చెంపతడుముకుంటూ.

"ఓరి! దీనికే ఇంత ఇదయితే ఎలారా?" రాజుగాడు మళ్ళీసిగిరెట్టు వెలిగించాడు.

"నాకు మూడు విమల, లలిత, వసంత, కామేశ్వరి, సుగుణ, వీళ్ళంతా లెంపకాయలేగాదు, మొట్టికాయలు, వాళ్ళనాన్నల్ని, అన్నల్ని పిలిచారురాబాబు.-చచ్చాను! ఇకప్రేమ సంగతి దేవుడెరుగును - బ్రతుకుతే ప్రేమించటం మాత్రం ఇక మీదట చస్తే చెయ్యను అనుకున్నాను. మరినీకు అనుభవంరావద్దూ! ఇదికొత్తేగా," అన్నాడు సుబ్బారావు సిగిరెట్టుపొగ వదులుతూ.

"ఒరె మూర్తీ! ఈ ప్రేమ గొడవమానేసి చదువుకో బాగుబడతావు." చివరి సలహా ఇచ్చాడు రాజు.

"లాభంలేదురా, ఎలాగయినా......"మూర్తి నిశ్చయానికొచ్చాడు.

"అంటే నువ్వు భగ్నప్రేమికుడివంటావు?"బైరాగి రాజువంక చూశాడు.

"అంతేగదురా!" రాజు పూర్తి చేశాడు.

"ఇప్పుడేం చెయ్యాలి?" బైరాగిప్రశ్న.

దేవదాసులో నాగేశ్వరరావు ఫీలింగు ఇచ్చి, "రాధ, రాధ ... నిన్నుచూడకుండ ఉండలేను ... నీవే నా సర్వస్వము ... నీవేనా..." సుబ్బారావు కవిత్వము ప్రారంభించాడు.

"నువ్వు నోరు మూస్తావా నాలుగుతన్నాలా?" రాజు గదమాయించాడు.

"ప్రభువుల చిత్తము" సుబ్బారావు నోరు రాజు నొక్కేశాడు.

"దీనికి మనమేమిచెయ్యాలేము" బైరాగి నిర్ణయానికొచ్చేశాడు.

"ఇప్పుడేలా?" రాజు ఆలోచనలో పడ్డాడు. బైరాగి మెదడుకు పనిచెప్పేడు.

సుబ్బారావు తలబాదుకున్నాడు.

జగం డిటెక్టివ్‌లా ప్రశ్నిస్తున్నాడు మూర్తిని.

చివరికి ఒకనిశ్చయానికి వచ్చేరు.

"ఏం లాభంలేదురా; పైగా ఆయన (రాధతండ్రి) ఎలాంటి వాడో తెలియదు? అందుకని రాధ చెప్పినట్టు మాట్లాడక చదువుకో."

మూర్తిమాట్లాడలేదు.

మేమందరము ఎవరి ఊళ్ళకు వాళ్ళు వెళ్ళాము.

ఒక పదిరోజులు గడిచినయి. ఆ రోజు ఊరంత తిరిగివచ్చిన నాకు ఒక శుభలేఖఇచ్చారు. ఆశ్చర్యపోయాను. "ఎల్లుండి, నాకు రాధకు పెళ్లి. తప్పక రావలసింది.

మిత్రుడు
"కృష్ణ"

అని లెటరుకూడ వ్రాశాడు. ఇదేమిటా అనుకుని ఇంట్లో చెప్పి వాడి పెళ్ళికి బయలుదేరాను. నేవెళ్ళేటప్పటికి రాజు, బైరాగికూడ వచ్చేశారు.

"అసలు ఎలా ఒప్పుకుందిరా రాధ?" అని మేమంతా వాణ్ణి ఊపిరాడకుండా అడిగాము.

"ఉండదర్రా చెపుతున్నాను. మొన్నవారం రోజులక్రిందట నాకు జ్వరమువచ్చింది. బాగవచ్చింది. నూటయిదుకూడ దాటి ఉంటుంది. నాకసలు ఒంటిమీద స్పృహలేదు రెండురోజులకు తగ్గింది కొంచెము. కళ్ళు తెరిచాను. కామేశ్వరరావుగారి ఇంట్లో పక్కమీద ఉన్నాను. పక్కనే రాధ నిలుచుని మందు కలిపి ఇస్తున్నది. ఇదేమిటా అనుకుని నలుపక్కలా దిక్కులుచూస్తున్నాను. రాధనవ్వుతూ, "ఏమండీ! నన్ను అంతగాఢంగ ప్రేమించారా? చచ్చిపోతారా? ఇక పొండిచూద్దాము. ఇంకేముందిలెండి భలేభయపడ్డాను మీకు తగ్గుతుందో లేదోనని. ఇంతెందుకు రేపు వారానికల్లా మీతోపాటు నేను వచ్చేస్తాను" అంది.

"అంటే" అన్నాను. నేను.

"అంటేనా?" అంటూ 'కొంటెగాచూసి, "ఇదిగో" అంది ఓ కార్డు నాచేతికిస్తూ. ఆ కార్డు శుభలేఖ అన్నమాట; అని మూర్తి పూర్తిచేశాడు.

"పోనీలేరా. అవస్తపడ్డందుకు ఫలితంలభించింది" అన్నాము.

"మరి మీనాన్నగారు, అమ్మగారు ఒప్పుకోవద్దూ? అన్నాను తెలియక.

"ఆ! అసలు తమాషా వినండి నేచెప్పగానే ఒప్పుకున్నారు." అన్నాడు. పచ్చనితోరణాలమధ్య, చక్కటిరాధమెళ్ళో మా వాడు కృష్ణమూర్తి సమంత్రకంగా తాళికట్టేడు.

"అదృష్టమంటే ఇదే" రాజు చివరిమాట పూర్తిచేశాడు.

---

పాలవాడు:-ఇవ్వాళ పాలు శేరు రూపాయి తల్లీ!

ఆమె:-ఇదేమిట్రా! రోజూ శేరు పన్నెండు అణాలేగదూ!

పాలవాడు:-ఔనమ్మా! కాని ఇవ్వాళ కొళాయిలు వేగంగా కట్టేశారమ్మాయిరి!

# కరగ్రహణము

శ్రీ యం. వి. ఆర్. కృష్ణశర్మ



సొమ్ముల ధరించుకొనిన సీతమ్మ నపుడు
సభకుఁ గొనివచ్చెఁ జెచ్చెర జనకరాజు
అనిలరాముల సన్నిధి నందు నిలిపి,
రామచంద్రునికి లీల దానఁ దెలిపె.

రామ! యీరామ గుణసీమ మామకాత్మ
జ! యిపుడీ బిడ నీకింక సతియు నగును
గాన స్వీకరింపు మగు మంగళము నీకు
నీమె కరము, కరము నగ్రహింపు మీవు.

ధన్యసుగుణ వల్లి పతివ్రతామతల్లి
యగుచు, భాగ్యంబులను బొంది మిగుల నీకు
ఛాయ లీల ననుసరించు సంతతంబ
టంచు రాముతో నతఁడు వచించినాఁడు.

జనకుఁడా లీల వచియించి సభికులెల్ల
నచ్చఁగా మెచ్చఁగా నుతుల్ హెచ్చఁ జేయ
రామమృదుహస్త సరసీజసీమయందు
నంబువులివిడె, సురహృదయంబు మెచ్చ.

మునులు సురులు 'బళే! బళే' యనిరి దేవ
తలమి భేరీగణంబు మ్రోగించినారు;
నెంచుచు, సుమవర్షము గురిపించినారు;
కన్నఁ గన్నులపండువై యున్న దపుడు.

జనకభూపుఁ డంతట మంత్రజలముతోడ
నెమ్మి రామభద్రునకు సీతమ్మ నొసఁగి,
నిరుపమాన హర్షంబాత్మ వరల, నిటులఁ
జటులి రాగాన వచియించెఁ బటురయాన.

లక్ష్మణా! రమ్ము మిఁక మంగళమ్ము నీకు
నూర్మిళ నొసంగు వాఁడను బేర్మి మీఱఁ
గరముగొనుము వేగంబు దత్కరము
గొనుమ
టంచు లక్ష్మణుతోడ వచించి, మఱియు

భరత! మాండవిహస్తంబు గరము
గొనుమ!
ధర్మశీలుండు పుణ్యుండు నిర్మలుండు,
జనకరాజు శత్రుఘ్నునిఁ గనుచుఁ బలికె
నాఁడు, శ్రుతకీర్తిఁ గొను మనినాఁడు
నాఁడు.

భూపనుత పాత్ర దశరథ పుత్రులార!
సౌమ్యచిత్తులు మీరంత, సంతతంబు
వ్రతములొనరించి నారలింపార మీర,
సతులఁ బొందుఁడు! సౌఖ్యంబు మతినిఁ
గనుఁడు!

జనకు నాదేశమంతయు విని, వసిష్ఠు
నానఁబడసి, వారురయంబుగాను, రాజ
సుతుల మృదులహస్తంబుల నతిముదంబు
బిట్టు వడఁగ మదినను, జేఁబట్టినారు.

నెమ్మి సతులతో నగ్నిహోత్రమ్మునకును
జనకనృపతికి, సభికులకు మునివరులకుఁ
బెండ్లికొమరులు సతులతోఁ బ్రీతిమీర
సలిపినారు ప్రదక్షిణ తలమివారు.

శాస్త్రవిధిఁగల్ప సూత్రంబుసరణి, నపుడు
వారలకు వివాహంబైన భాగ్యవేళ
నాకసమునుండి పూవానలట్టెకురిసె ;
దంపతుల కాశీస్సులు బెంపునయ్యె.

భేరు లాకసంబుననుండి విరివిమ్రోసె;
వివిధ వాద్యంబులందున వెల్లి విరిసె ;
నప్సరస గంధర్వులులి ప్సమీర,
నాడిపాడి నాతలపుకు గాఢముగను.

అట్లు నృత్యగీతాది వాద్యమ్ములిమ్ము
దనర, ముమ్మారువారు ప్రదక్షిణమ్ము
ననిలునకుఁజేసి, సతులఁబెండ్లాడినారు;
మంగళనినాదములు గడుంబొంగిపొరల
పెండ్లి కొమరులు విడిఁదికి వెడలినారు
వారి వెంటనరాగ, మవ్వారిగాఁగ,
దశరథనృపాలుఁడు, మునీశతతులు, సతులు
మించుసుతులఁ గాంచుచు వెంబడించి చనిరి

("వాల్మీకి రామాయణము" నుండి)

# పెండ్లి పిలుపు

**శ్రీ ధాయిపులె బాలకృష్ణరావు**

"రాధా ...! పలకవేం?" అప్పుడే వచ్చిన దినపత్రికను తిరగవేస్తూ పిలిచాడు మోహన్.

"ఆ ... ఆ ... వస్తున్నానండి! కొంచెము వోపిక పట్టండి. పాలలో డికాక్షన్ యిప్పుడే కలిపాను." వంటింట్లోంచి జవాబిచ్చింది రాధ.

"చంపావ్! బండికి వేళయింది. త్వరగా వెళ్తేనెగాని మనకు బండి అందదు."

"అంత తొందర చేయకుంటే, యీ విషయం నిన్ననే చెప్పగూడదటండీ!" కొంచెము కోపంగానే అంది రాధ. చురచుర వంటింట్లోనుండి మోహన్ కూర్చున్న గదిలోకి వచ్చింది. రాధలో వుండే ఆ కొంచెం కోపం మోహన్ మన్మధ వీక్షణాల్లో మంచుగడ్డలా కరిగిపోయింది. ఆమె కనురెప్పలు బరువుగా సిగ్గుతో క్రిందికి వాలాయి.

"ఏవిషయమంటావ్ రాధా?" చిరునవ్వుతో పలకరించాడు మోహన్.

"అదేనండి ...! మా చెల్లెలి వివాహ ఆహ్వాన పత్రిక విషయం" నెమ్మదిగా జవాబిచ్చింది రాధ.

"ఆ విషయంలో నా తప్పేముంది. పిలుపు పత్రికవచ్చి గంటగూడకాలేదే! వచ్చినతోటే నీతో చెప్పాను. చూడూ! కాఫీ, ఫలహారము త్వరగా తీసుకరా! వేళయిందిగాని!" సున్నితంగా సమాధానమిచ్చాడు మోహన్.

"ఇంతకూ వివావాము ఎప్పుడో చెప్పారుకారు."

"మరునాడే! సందేహమెందుకూ! వెళ్ళు ... వెళ్ళు, త్వరగా కానీ."

"సామానంత సర్దండి నేవచ్చేలోగ" వంటింట్లోకి వెళ్లిపోతూ అంది రాధ.

"సర్దడానికేముంది. అదంతా ఎప్పుడో అయిపోయింది. ఇపుడు నీ సరదాకొరకు కాచుకొనివున్నా. త్వరగా రా" చిరునవ్వు నవ్వాడు మోహన్.

♦ ♦ ♦

మోహన్ రెండు సెకండ్ క్లాసు టికెట్లు మద్రాసుకు తీసికొన్నాడు.

మద్రాసు రైలు ఆ రోజు కొంచెము ఆలస్యంగానే వచ్చింది. మోహన్, రాధ. ఖాళీగావుండె సెకండ్ క్లాసు కంపార్ట్మెంట్లో ఎక్కారు.

"ఏమండీ! సామానులన్ని సరిగా ఉన్నాయి గదండి?"

"ఆ ... ఆ ... సరిగా వున్నట్లే. బోలెడు సామానులున్నట్లు మాట్లాడుతున్నావే. ట్రంకు నా దగ్గర, హ్యాండ్ బ్యాంగ్ నీ దగ్గర. యింకేం ..." మెల్లగా నవ్వాడు.

"ఓహోయ్ ప్యాసింజర్లు జాగ్రత్తగా వుండండి నేబయలుదేరుతున్నా"నన్నట్లు పెద్దగా కూతేస్తూ రైలు కదిలింది.

రాధ తన చెల్లెలి వివాహము ఎంత వైభవంగా జరుగుతుందో ఆలోచించుకుంటూ, కంపార్ట్మెంట్ కిటికీలోనుంచి బాహ్య ప్రకృతిని మాస్తూ ఆనందించ సాగింది.

రైలు ఒక స్టేషన్ వద్ద ఆగింది. రాధ పెట్టె తలుపు దగ్గరికివచ్చి నిలబడింది. తిరిగి భర్త దగ్గరికి పోయి –

"మా పిన్నిగారి వూరు యిదేనండీ. వారు గూడ యీ రోజే వస్తారు కాబోలు!"

"నిన్నునే పోయివుండవచ్చు...దానికేం !"

తిరిగి రాధ ద్వారము దగ్గరపోయి నిలబడింది.

"హల్లో రాధా !" క్రొత్త వ్యక్తి కరచాలనం కోటకు చేయిజాపి చటుక్కున చేయి వెనక్కి తీసికొని రెండు చేతులు జోడించి "నమస్కారం" అనగలిగాడు.

"నమస్తేనండి" అంటూ కంపార్టుమెంట్ దిగింది రాధ. రాధ వదనంలో చిరునవ్వు సుస్పష్టంగా ప్రతిఫలిస్తూంది.

ఇదంతా చూస్తున్న మోహన్‌కు తలతిరిగినట్లయింది. ఆ క్రొత్త వ్యక్తిని, రాధ కొంత దూరము పిలుచుకొనిపోయి మాట్లాడుకుంటూ నిల్చింది, వారి సుస్పష్టంగా వినబడని సంభాషణలు వింటూ కూర్చున్నాడు మోహన్.

"కాలేజినుండి విడిపోయి మరి యిన్నాళ్లకు మనం మీటయినామండీ అదంతా దేవునికృప అనాలిసిందే. ఏమంటారు ?"

"నిజమే రాధా" చిరునవ్వుతో తలవాలుస్తూ జవాబిచ్చాడు క్రొత్త వ్యక్తి.

"ఈ మధ్య క్రొత్తగా వెలువడిన 'అభ్యుదయ' పత్రికలో ప్రచురణమైన మీ కథానికలు చదివాను. అవి చాల బాగున్నాయ్. ఆ పత్రికకే మీ కథానికలు ఒక క్రొత్త శోభను కూర్చాయి. ఇంకా చెప్పాలంటే ..."

"ఇక అంతటితో చాలించు రాధ. ఈ నాటి అభ్యుదయ కవులకు ఆకాశాన్ని మించిపోయె పొగడ్తలు ..." చిరునవ్వు నవ్వి "అనవసరం" ముక్తసరిగా జవాబిచ్చాడు.

ఇంకా ఏవేవో మాట్లాడుకున్నారు. అవి స్పష్టంగా వినబడలేదు మోహన్‌కు.

"ఓ ! యటీజ్ ఫయివ్ మినట్స్ మోర్ వన్లీ. వస్తా గుడ్ బై." సుందర దరహాసము చేస్తూ రాధ వెనక్కి మళ్లింది.

"ఓ. కె" క్రొత్త వ్యక్తి చేయి ఊపాడు చిరునవ్వుతో.

రైలు కదిలింది. మోహన్, రాధ మౌనంగా కూర్చున్నారు. మోహన్ తనను ఏమైన అడుగుతాడనే కంగారు రాధకువుంది. అవకాశము కొరకు కాచుకొని కూర్చుంది. భర్తవేపు ఒకసారి తిరిగి చూసింది. మోహన్ వదనంలో ఏదో అవ్యక్తమైన బాధ యిమిడివుందని గ్రహించింది.

"రాధా" పలుకరించాడు మోహన్.

"........."

"ఇందాక నీతో మాట్లాడిన ఆ సూటు, బూటు వేసిన పెద్దమనిషేవరు ?" సిగరెట్టు ముట్టిస్తూ ప్రశాంతంగా అడిగాడు. బాధ మాత్రం మనసులో ప్రగాఢంగా అలుముకొనివుంది.

"......" ముసి, ముసి నవ్వు నవ్వింది రాధ.

"అతగాడు చాల మంచివాడుకదూ. చాల సన్నిహితంగగూడ మాట్లాడాడుకదూ !"

"అవునండి" ముసిముసి నవ్వింది రాధ.

"ఊఁ" మనసులో మాత్రం కోపం అధికంగానే వుంది. కాని దానిని బయటికి తీసుకొని రావడానికి సమయంకొరకు నిరీక్షిస్తున్నాడు.

"ఆయనతో నీ కింతకుముందునుండి పరిచయముందా ?"

"ఉఁ ఉందండి" తలూపుతూ అంది రాధ.

"ముఖపరిచయమేనా ?" సిగరెటు దమ్ము ఘాటుగా పీల్చాడు.

"గృహపరిచయంగూడానండి."

మోహన్‌కు వొల్లు మండింది.

"ఊ అందుకే ఆడవారికి అలుసివ్వరాదన్నారు. రాధా ! అడుగుతున్నా నిజం చెబుతావా ! చెప్పవా ! ఆ పెద్ద మనిషెవరు ? ఆయనతో నీకేం

పని? నవ్వుతూ, తుళ్ళుతూ ప్లాట్‌ఫారమ్‌మీద నిలబడి ఆయనతో మాట్లాడ్డం నీకేం పని?"

"ఏమిటండి అలా కోప్పడుతున్నారు? నన్నపార్థముచేసికొని ఏమేమో మాట్లాడుతున్నారే?" రాధ లోలోన నవ్వుకుంది.

"కాదు అర్థముచేసికొనే మాట్లాడుతున్నా. నీ గుణం యిలా పయోముఖ విషకుంభంలా వుంటుందని నేనెప్పుడు అనుకోలేదు. ఇప్పుడు గ్రహించాను. నీ హృదయం ఎంత కల్మషమైందో!"

"అంతటితో ఆగండి. ఆయనెవరో మీ కేందుకండి?" చిరునవ్వుతో జవాబిచ్చింది రాధ.

"నా కెందుకూ - బాగుంది! ఈ సారి ఖచ్చితంగా అడుగుతున్నా. చెబుతావా? లేదా?" గ్రుడ్లురిమిస్తూ అడిగాడు.

"అంత కోప్పడితే ఎలాగండి? కోపం వస్తే కొరుక్కుతినరుగదండీ" అంటూ నవ్వసాగింది.

"అంతా వేళాకోళమాడుతున్నావే?"

"ఆయన చాల మంచివారండీ. ప్రశాంత మూర్తులు." రాధ ఆ మాత్రం అనగలిగింది.

"అలాగండీ..." వెకిలిగా చెబుతూ "ఎవరో చెప్పావు కాదసలు?" అని ప్రశ్నార్థకంగా అడిగాడు.

"ఆయనతో నా..." నవ్వు ఆపుకోలేకపోయింది రాధ. భర్త అవివేకాన్ని తెలిసికొని.

"చెప్పవేం...?"

"ఆడవారికి అంత మాత్రం హక్కు లేదండీ...?",

"ఊహు. మగవారితో మాట్లాడగూడదు."

"అలాగైతే మగవారు ఆడవారితో మాట్లాడగూడదు."

"అదెలాగౌతుంది."

"ఇది ఎలాగౌతుంది. సమానత్వం, సమానత్వం అంటారే - యిదేనా సమానత్వం?"

"ఏంతత్వమోమరి. నీ తత్వం, నా తత్వం రెండూ ఏకంకావాలంటే కష్టం. బహుచక్కగా వాదిస్తావే! ఓహో... ఐ యామ్ సారి! యింటర్ మిడియట్‌లో లాజిక్ చదివావని ఒకసారి చెప్పినట్లు జ్ఞాపకం. ఊఁ సరేగాని, మీ ప్రణయ సంభాషణలేవో చెప్పావు కాదే?"

"ఏమిటీ" రాధ ప్రశ్నించింది. ఇంతవరకూ కథ వస్తుందని రాధ ఎప్పుడో వూహించింది.

"ప్రణయం"

"మీరేదో నాపై ప్రళయం తెస్తున్నారే!"

"చెబుతావా - చెప్పవా?" మోహన్ తనలో తాను విసుగుకున్నాడు - ఎంతకూ రాధ జవాబు చెప్పకుంటె.

"ఆగండి. అంత తొందరపడితే ఎలాగు. తొం...ద...ర...ప...డ...రా...దు. తొందర పడరాదన్నారు పెద్దలు. మీరేదో దానికి విరుద్ధంగా నడుస్తున్నారే!" ప్రశాంతంగా అంది రాధ.

మోహన్‌కు అరికాలిమంట నెత్తికెక్కింది.

"మీ యిద్దరిమధ్య సంభాషణ జరగడాకి కారణం అంతా ఒక్కసారిగా చెబుతావా, లేదా?"ని

"శాంతించండి. చెబుతాను....దప్పికౌతుందండి. కొంచెం మంచి నీళ్లు కావాలి."

"మం...చి...నీ...ళ్లు" అక్షరాలను ఒత్తిపలికాడు కోపంతో. "అదుగో మరచెంబు తెచ్చావే, త్రాగు" హుంకరించాడు.

నీళ్లు కొంచెము మాత్రము త్రాగి "అమ్మయ్య! దప్పితీరింది. మీ సందేహతృష్ణ తీరుస్తాను... మరే ఆయనపేరు చంద్రం... మరే..."

"మరేలేదు గిరేలేదు. ఆలస్యంచేయక చెప్పు."

"అవున్లెండి ఆలస్యం అమృతం విషం అన్నారు పెద్దలు. ఆయన, నేను కాలేజిలో యింటర్ చదివే

రోజుల్లో, ఆంధ్ర సారస్వత సమితికి అధ్యక్షులుగా నిలబడ్డారు. ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు, మా కాలేజి మాక్ పార్లమెంటులోగూడ ఆయనే అధ్యక్షుడు. ఉపన్యాస మివ్వడంలో ఆరితేరిన హ్యాండ్ అండి! ఆయన యీ మధ్య, కథానికలు వ్రాయడం, పత్రికలకు పంపడం, ప్రచురణకావడం, ఆయన కథలను పాఠకలోకమంతా చదివి ఆనందించడం పరిపాటైంది. ఆయనిప్పుడు బి. ఎ. చదువుతున్నాడు."

"సరేగాని ఆయనతో మాట్లాడ్డం నీకేంపని?"

"అలాగండీ ... ఆగండి చెబుతాను." గుటక దిగ్రమింగింది రాధ.

"చెప్పగూడదూ ... ఆగడమేమిటే? నేను కాగడమేమిటి?"

"ఆడవారిపై అంత అనుమానం ఎందుకండీ మీకు? అనుమానం ప్రాణసంకటం. సరేగాని మీరు డాక్టరు దగ్గరికి వెళ్ళాలండి" ముసిముసి నవ్వు నవ్వింది రాధ.

"ఎందుకూ నాకు జబ్బా ఏమైనా!"

"అవునండి! మీకు కళ్ళజోడు కావాలి..."

"అబ్బా! ఏమిటోనవ్వు. చెప్పేదేమిటో సరిగా చెప్పగూడదూ ... నాతో అపహాస్యమాడుతున్నావే!"

"కాకుంటే మరేమిటండి, అంతమటుకు గుర్తుపట్టకుంటే ఎలాగండి! మా పిన్నికొడుకూ, మీ బావమరది చంద్రాన్ని గుర్తుపట్టలేకపోయారు గదండి." రాధ భర్త అవివేకాన్నిచూసి నవ్వసాగింది. మోహన్ తెల్లబోయాడు.

"ఎవరూ ...! రామచంద్రమా. నా తెలివి తెల్లారినట్లేవుంది. మరి నువ్వు చెప్పావు కావే. వాడి డ్రెస్సు, సూటు, బూటు, చలువ అద్దాలు, నిక్కా, సీటు - అవన్నీచూసి ఎవరో అనుకొన్నాను. చాల మారిపోయాడే వాడు."

"కాలేజీల్లో చదివేవారు మారిపోక ఎలాగుంటారు?"

"మరి, నువ్వు మొదట్నే చెప్పావు కావే! పోనీ వాడైనావచ్చి నాతో మాట్లాడిన పాపాన పోలేదే!"

"ఎందుకు చెప్పాలి! మిమ్మల్ని ఏడ్పించాలనుకున్నా. అందుకే యీ పన్నాగం" నవ్వు ఆమె పెదవులపై ఆవరించుకుంది. కడుపుబ్బ నవ్వింది.

"వాడితో చెప్పింది నేనే ..."

"ఏమని?" సూటిగా ప్రశ్నించాడు.

"మీ బావతో చిన్న తమాషచేసి ఏడిపించాలనుకున్నానని; నీవుపోయి మాట్లాడవద్దనిగూడ చెప్పాను. సరే అంటూ తలూపాడు చంద్రం" చప్పట్లుకొడుతూ కిలకిలా నవ్వింది రాధ.

"అమ్మ దొంగ ఎంత పన్నాగం పన్నావ్! ఇంతకూ క్షమించు రాధ నన్ను! నిన్నర్థంచేసికొనలేక ఏమేమో అన్నాను."

"ఆ, ఆ ... క్షమించడానికేముందిలెండి" చిరునవ్వు నవ్వింది రాధ.

"ఇంతకూ బలే తమాష చేశావ్." మనసులో అభినందించాడు.

రైలు మామూలు వేగంకంటె కొంచెం వేగం హెచ్చించింది. ప్రక్క కంపార్ట్‌మెంట్‌నుండి వినబడుతున్న బిక్షగాని పాట వినశ్రావ్యంగావుంది. పాటకుతోడు రైలు చక్రాల శబ్దము లయగా కుదురుకుంది.

కొంతసేపటికి యింకొక స్టేషన్ వచ్చింది. అచ్చటాగింది.

"రాధా! ఆ మర చెంబులో రెండు కప్పులు కాఫీ తీసుకరాపో! యిందా రూపాయి. ఇంక రెండు స్టేషన్‌లు దాటాలి మనం."

"మీరు పోగూడదటండీ."

"పరువాలేదులే వెళ్ళిరా త్వరగా. ఏదో ఆడవారికి స్వాతంత్ర్యం కావాలి, సంఘజీవనంలో సమాన హక్కులుండాలని వాదిస్తుంటావే!" రాధ చిన్న చిరునవ్వునవ్వి వెళ్లిపోయింది. రాధ వెళ్ళిన తర్వాత తనకు తాను ముసిముసి నవ్వు నవ్వుకున్నాడు.

రాధ తిరిగి వచ్చింది.

"మీరేమైనా కాఫీ త్రాగుతారా?"

"ఊహుఁ యిప్పుడక్కరలేదు."

రైలు తనపని నిర్వర్తించుకొని కదిలింది.

"రాధా!" కంగారుగా అరిచాడు మోహన్, చిత్తరపోతూ.

"ఏమండీ! ..." భయంగాను, కంగారుగాను అడిగింది రాధ.

"... ... ..." మోహన్ ఏదో వెదక నారంభించాడు ఆతురతతో. నొసట చెమట దట్టంగా క్రమ్ముకుంది. చెదిరి, బెదరిన చూపులతో అటు, యిటు చూస్తున్నాడు.

"రాధా! అయ్యో ఎంతపని చేసింది యీ 'పెండ్లిపిలుపు' ప్రయాణం" దుఃఖమంతా క్రోడీకరించి చెప్పాడు.

"ఏమైందండీ"

"హ్యాండ్ బ్యాగ్, ట్రంకు కనబడ్డంలేదు! నీ దగ్గరుందా!"

"బాగుందండి! నా చేతిలోవుండే హ్యాండ్ బ్యాగ్, ట్రంకు యీ పైసామానుల అటకమీదే కదండి మీరు పెట్టింది. నేను కాఫీ తీసుకరావడానికి వెళ్లితినే. మీరప్పుడు యిక్కడే వుంటిరి గదాండి! వాటిపై కొంచెం జాగ్రత్తవుండనక్కరలేదూ!" కళ్లెర్రజేసి అన్నది రాధ.

"అదేంటి రాధ అలా కోప్పడుతున్నావ్. నీవు వెళ్లగానే నేను ప్లాట్‌ఫారమ్‌మీదికి గాలి పీల్చుకోడానికి దిగాను. తెలీదూ?" జవాబిచ్చాడు మోహన్. అతని ముడుతలుపడిన ఫాలభాగము కంగారుగా కనబడే కళ్లు నమ్మమని చెబుతున్నాయి. నిజమని ఘోషిస్తున్నాయి.

"నాకేం తెలీదు. ఇంతకూ అయ్యో! నానగలు, పట్టు చీరలు అన్నీ ఆ ట్రంకులో ఉన్నాయే! ఎలాగండియింకా!" రాధ కొంచెము స్వార్థం కనపరచింది.

రాధకు ఏడుపువచ్చినంత పర్యంతం అయింది. నొసట చెమట పట్టింది. వొళ్లు జలదరించింది.

"ఎంతపని చేశారండీ. ప్రక్కస్టేషన్లో పోలీసులకన్నపోయి రిపోర్టు చేయండి" కళ్ళనుండి కారుతున్న నీళ్లను చీరకొంగుతో తుడుచుకుంది రాధ. భర్తవేపు తిరిగి చూసింది. మోహన్ నోటికి చేతిరుమాలు పెట్టుకొని ఒకే నవ్వు నవ్వుతున్నాడు. తాను నాటకం బాగా ఆడానని తనకుతాను అభినందించుకున్నాడు.

"ఏమండీ! అలానవ్వుతున్నారు. అవుల్లేండి. నా అలంకరణ సొత్తులన్నీ పోవడం బాగైందనే కదా మీరు నవ్వేది. ఊఁ నవ్వండి ... నవ్వండి ... వొకరికి నవ్వు ... మరొకరికి ఏడుపు ... బాగుంది."

"అది కాదు రాధా" నవ్వుతూనే జవాబిచ్చాడు.

"ఏమిటిదో త్వరగా చెప్పగూడదటండీ ... ఆ ... ఆ దొంగను చూశారా! చెప్పరేం ... అబ్బ ... ఏమిటానవ్వు ..."

"ఆగు! అంత తొందరపడితే ఎలాగు"

"అబ్బ! చెప్పరేఁ స్టేషన్ దగ్గరికి వస్తుంది."

"తొం ... ద .. ర ... ప ... డ ... రా ... దు. తొందరపడరాదని కదా పెద్దలు నుడివింది. దానిని నువ్వు కాసిస్తే ఎలాగు? నీవు చేసిన తమాషవల్ల నేను ఏడ్చానా, లేకుంటే ..."

"అబ్బ చెప్పగూడదటండీ ఏమిటానవ్వు!"

"...నేను చేసిన తమాషవల్ల నీవు ఏడ్చేవా ?"

"ఏమిటీ ! తమాష !! అంటే ... ట్రంకు, సంచి ఎక్కడో దాచి పెట్టి వుంటారన్న మాట !" చీరకొంగుతో కళ్ళు తుడుచుకుంది.

"అవే నిన్ను ఏడ్పించడానికి కారణమైనాయన్న మాట" వ్యంగ్యంగా చెప్పాడు. "ప్రక్క కంపార్ట్మెంటులో మీ పిన్నివాళ్ళున్నారు. వాళ్ళ దగ్గర భద్రంగా వుంచాను. వాళ్ళుగూడ మనతోపాటే వస్తున్నారు. నీతో చిన్న తమాషచేసి ఏడ్పిస్తానని చంద్రంతో చెప్పితే కడుపు చెక్కలయ్యేట్లు నవ్వాడు. మీ పిన్నిగారితో గూడ చెప్పాను. వారు గూడ నవ్వారులే !"

"వాళ్ళు మనతో పాటు వస్తున్నారటండీ! మరి చంద్రం రేపు సకుటుంబ సమేతంగా వస్తానని నాతో చెప్పాడుగదండి"

"బాగ చెప్పాడు. తగిన శాస్తి-సరేగాని యిపుడు ఏడ్పించిందెవరంటావ్ ?" పకపక నవ్వాడు మోహన్.

"నేను మిమ్మల్ని - మీరునన్ను ... సరికి - సరి"

"ఎలాగైతుంది. నీవు నా మనస్సును కష్టపెట్టావ్; నేను నీ మనస్సును కష్టపెట్టి, మరీ ఏడ్పించాను. అంటే దెబ్బకు పైదెబ్బ వేశానన్నమాట. కనుక, నేను అంటే శ్రీవారు బెట్ యు యిన్ ది 'గేమ్ ఆఫ్ మేకింగ్ వొన్ టు వీప్'"

"మీరుగెలువకుంటే యింకెవరు గెలుస్తారండి" చిరునవ్వు నవ్వింది రాధ.

"అంతేలే !" బిగ్గరగానవ్వాడు మోహన్ రాధ ముఖం చిన్నబోయింది. మోహన్ వదనం వికసించింది.

కొద్ది సేపటికి, యిద్దరూ ఒకరికేసి ఒకరుచూసి అప్రయత్నంగా నవ్వారు.

—X—

## దసరా, దీపావళి క్రిస్మస్ పండుగలకు రైలు చార్జీ తగ్గింపులు

వచ్చే దసరా, దీపావళి, క్రిస్మస్ శెలవల కాలంలో నిరుటేడులాగే ఈ సంవత్సరంకూడా రైల్వేబోర్డు చవక టిక్కెట్లు ఇవ్వడానికి నిశ్చయించిందని ఒక అధికార ప్రకటన చేశారు.

దసరా పండుగకు సెప్టెంబరు 20నుంచి అక్టోబరు 8దాకా తిరుగు ప్రయాణపు టిక్కెట్లు ఇస్తారు. ఇలాగే, దీపావళికి, అక్టోబరు 19 నుంచి 24 దాకానూ, క్రిస్మస్‌కి డిశంబరు 15 నుంచి 1958 జనవరి 5 దాకానూ తిరుగు ప్రయాణపు టిక్కెట్లు ఇస్తారు.

ఒక ప్రయాణం చెయ్యడానికయ్యే టిక్కెట్టు ఖర్చులో నాల్గవభాగం తగ్గించి ఈ తిరుగు ప్రయాణపు టిక్కెట్లు అమ్ముతారు.

ఈ టిక్కెట్లు, అవి కొన్న రోజూ, తిరుగుప్రయాణం పూర్తిచేసిన రోజూ కలుపుకుని, పదిహేను రోజులలోగా వాడుకోవాలి.

150 మైళ్ళపైన చేసే ప్రయాణానికే ఈ టిక్కెట్లు ఇస్తారు. తిరుగు ప్రయాణంలో మధ్యలో ఎక్కడా ఆగకూడదు. వెళ్లేటపుడు మాత్రం దారిలో ఎక్కడైనా దిగవచ్చు.

P. I. B

# పర్ణశాల

శ్రీ కన్నెకంటి ప్రభాకరశాస్త్రి

అది లతానికుంజ విశాల యాశ్రమంబు
మల్లెమందార మాలతీ మందిరమ్ము!
జాజి సంపెంగ సౌగంధి జనితమయము
పచ్చపత్రాల నిర్మిత పర్ణశాల.

జనకు నాజ్ఞను పాలింప మునమునందు
దీక్షఁబూనిన శ్రీరామ దివ్యమూర్తి
భార్య జానకి దనవెంట బయలు దేర
పర్ణశాలకు జనుదెంచె భ్రాత తోడ!

శ్రీ జానకిని జూచి చిలుకమ్మ పలికెను
స్వాగతవచనాలు సంతసముగ!
పూవులు భక్తితో పుష్పొడిపై జల్లి
పాదాల పై వ్రాల ప్రణుతి జేసె!
మామిడి చిగురుల నమితముగా మెక్కి
కూర్మిఁబాటల ఁబాడెనుఁగోకిలమ్మ!
కర్పూర హారతై ఖద్యోతమప్పుడు
కళకళలాడెను కాంతితోడ!

మూర్ధములు వంచెతరువులు ముదమటంచు
హాయిగా రాగ మందించెవాయు రాజు
పరుగు దీయుచు గెంతుచు హరిణజాతి
నేర్పుతోనాట్యమును సల్పెనెమలి గుంపు
భక్తి వెద జల్లె దివ్యదంపతులకపుడు.
రేయెల్ల మేల్కొని రేరాణి పువ్వులు
సీతమ్మ రక్షణసేయు చుండు!
అల్లి బిల్లిగ నల్లిమల్లె తీగలగుంపు
జానకీ దేవిని గనుచునుండు
ముఖ మెర్రగాజేసి ముదితమందారమ్ము
శత్రు మూకల సదా చంపుచుండు!
పత్రాల నక్షుల మిత్రులై మెలగుచు
కమలము దేవికి కానుకలిడును!
హరిణ శార్దూల భల్లూకి కాండజములు
మైత్రి శ్రీరాము పాదాల నాశ్రయించి
జన్మ ధన్యత నొందిన పుణ్యభూమి!
భవ్య గుణగణ శాల! మా పర్ణశాల!

# తెల్ల రోజా!

రచయిత్రి : ఇన్‌గే షోల్
అనుసరణ : డాక్టరు వి. ఎస్. శర్మ

## I

[అవి జర్మనుదేశంలో హిట్లరు ఏకఛత్రాధిపత్యంగా అధికారాన్ని చలాయిస్తూ ఒక్క జర్మనులనేగాక, అయిరోపాఖండవాసుల్ని – ప్రపంచంలో వున్నవాళ్లనంతా – అస్తమానమూ హడలుగొడుతూ వున్న రోజులు. హిట్లరు దారుణకృత్యాల్ని అరికట్టటానికి ఎంతోమంది సాహసించి, ప్రాణాల్ని త్యజించి ధన్యులయ్యారు. అలాటి శ్రేణికి చెందిన వాళ్లే "తెల్లరోజా" విద్యార్థివీరులు. "తెల్లరోజా" ఈ విద్యార్థివీరుల చిహ్నము. ఈ విద్యార్థి స్వాతంత్ర్యోద్యమాన్ని నడిపినవాళ్లు ఆరుగురు. నలుగురు విద్యార్థినాయకులు. ఒక విద్యార్థిని. వాళ్ల ప్రొఫెసరు ఆరోవాడు. వాళ్లవీరగాథలని మనకు కళ్ళకు కట్టేటట్టు చిత్రిస్తూ ఇన్‌గే షోల్ వ్రాసిన చరిత్రే యీ "తెల్లరోజా". ఈ రచయిత్రి తమ్ముడు హాన్స్, చెల్లి సోఫి ఈ యుద్యమాన్ని ధైర్యసాహసాదులతో నడిపిన ధన్యులు. .... ....

పోలీసులు ఈ యుద్యమాన్ని చిందరవందర చేయటానికి ఎన్నెన్నో పద్ధతులను అవలంబించారు. కాని అవేవీ ఫలించాయికాదు. నాయకులు ఎవరు అనే పత్తా ఏదో విధంగా పసికట్టారు. విశ్వవిద్యాలయం భవనంలో ఒక రోజు వుదయాన హాన్స్‌ని, సోఫీని, వాళ్ళకు ఆ సమయాన కుడిభుజంగావున్న క్రిస్టల్ అనే విద్యార్థినాయకుడ్నీ అరెస్టుచేసి జయిల్‌లోకి తెచ్చారు. అక్కడ జరగాలసిన తతంగమంతా రెండు రోజులు పోలీసువాళ్ళు అనుకున్న విధంగా జరిపారు. ఆ సమయాన హాన్స్ గదిలోనే ఖైదీగావున్న హెల్‌మూట్ అనే యువకుడు ఆరోజుల్లో హాన్స్ అనుభవిస్తూవున్న యమయాతన్ని మనకు తెలుపుతున్నాడు.]

"...హాన్స్ నన్ను బాగా అర్థంచేసుకోగలిగే మాకు అవకాశభాగ్యం లభించిదనే విషయాన్ని గాడు. అంచేత ఆ రోజుల్లో ఆప్తమిత్రులకన్నా ఈ జన్మలో ఎలా మరచిపోగలుగుతాను ? ... ఎక్కువగానే ఆ గదిలో కాలక్షేపం చేయటానికి పోలీసుల "వాఙ్మూలం తీసుకోటం" అనే

తతంగమంతా ఏదో ఒక విధంగా పూర్తి అయిందనే చెప్పాలి. ... తెల్లవారింది. ఆ రోజున్నే జడ్జీలు సమావేశమై "కేసు"ను విచారిస్తారు. నిద్ర లేచాడో లేదో తనతో ఆ రోజున కేసుకు సంబంధించిన విషయాల్ని ప్రస్తావించవద్దని హాన్స్ బ్రతిమాలుకున్నాడు. కారణం నాకు తెలుసుగా! అంచేత నేనూ హాన్స్ కోరికను తూచా తప్పకుండా నెరవేర్చటానికి శాయశక్తులా ప్రయత్నించాను. ...

రాత్రంతా హాన్స్ మేలుకొనేవున్నాడు. అతని ప్రక్కనే నేనూ పడుకొనివున్నాను. అతని అవస్థని చూస్తూ హడలిపోతూవున్న నాకు అలాటి పరిస్థితుల్లో నిద్రఎలాపడుతుంది? ... కంట నీరు. నీటిని తుడుచుకోటానికి సతమతమైపోతున్నాడు పాపం, హాన్స్! మరునాడు ఏంనిర్ణయింపబడుతుందో ఆ నిర్ణయం ప్రకారం విధి తనని ఎలా నడిపించుకుని వెడుతుందో హాన్స్‌కి బాగా తెలిసేవుండి వుండాలి. లేకపోతే అలా యాతనపడటానికి అవసరమేలేదుగా! ఈ పోలీసులకన్నా, ఆ జడ్జీలకన్నా, తను ఎదుర్కొనాలసింది మృత్యుదేవతను అనే సంగతి అతనికి గ్రాహ్యమైందని పసికట్టాడు. ఆ లోకానికి వెళ్ళటానికిముందు తన స్నేహితులను తలుస్తూవున్నాడు. వాళ్ళు ఒకరా ఇద్దరా! ఆవూళ్ళోవున్నారు. ఇతర వూళ్ళలోవున్నారు. తనుపోయాక యుద్యమాన్ని జయప్రదంగా సాగించాలసిన బాధ్యత ఇప్పుడు వాళ్ళమీదపడ్డది. ... వాళ్ళ దగ్గర సెలవుపుచ్చుకుంటూన్నాడు మధ్య మధ్య నిట్టూర్పు విడుస్తూ! అలా చేయటానికి ఎంతగుండె నిబ్బరం వుండాలి ఇలాటి యువకులకు? ... ...

కాఫీగట్ర ముగించాము. ఇక హాన్స్ ఇక్కడినుంచి బయలుదేరాలి. ఏనిమిషానికైనా వాళ్ళు తప్పకరావచ్చు మా హాన్స్‌ను కోర్టుకు తీసుకునివెళ్ళడానికి. అక్కడినుంచి ఎక్కడికి తీసుకొనివెళ్తారో, తరువాత ఏంఅవుతుందో తెలుసుగా ...

వాళ్ళ అమ్మ, నాన్నలకు చెప్పాలసిన సంగతులను, మిత్రులకు అందచేయాలసిన వార్తలను హాన్స్ చెప్పాడు. తరువాత నా చేతిని గట్టిగా నొక్కుతూ ఎక్కడాలేని పిచ్చిధైర్య సాహసాలను ఆ సమయానికి తెచ్చుకుని "ఇక సెలవుపుచ్చుకుంటాను. నువ్వు ఇక ఒంటరిగా వుండాలసివస్తుంది. నేనూ ఒంటరిగా వుండాలని వస్తుంది" అని అన్నాడు.

బల్లమీదవున్న పెన్సిల్‌ని చప్పుచప్పున పుచ్చుకుని గోడ దగ్గరకు వెళ్లాడు. లోపలచడీచప్పుడూలేదు. గోడమీదవ్రాయటానికి మొదలెట్టాడు. ... ఇంతలోకి బయట చప్పుడవుతున్నది. ఆదరాబాదరా తలుపును తెరుచుకుని జైలు కమీషనరే లోపలికివచ్చి, భేడీలన హాన్స్‌చేతులకివేసి కోర్టుకు తీసుకుని వెళ్లాడు.

అతను వెళ్లాక గోడమీద అతను వ్రాసిన దానిని చూశాను. వ్రాసింది ఒకే వాక్యాన్ని!

"ఎన్ని అవాంతరాలు వచ్చినా గుండెని నిబ్బరం చేసుకునే వుండటం సర్వోత్తమం."

## II

మా తమ్ముణ్ణీ, చెల్లెల్నీ అరెస్టుచేయబోతూన్నారనే సంగతి ఎలాగో సోఫీ స్నేహితురాలు పసికట్టింది. ఆ సంగతిని వెంటనే మా నాన్నకు, అమ్మకూ, ఆ అమ్మాయి తెలిపింది. శనివారంనాడు వాళ్లను అరెస్టుచేశారో లేదో, మరో విద్యార్థి ఈ విచారఘట్టాన్ని, టెలిఫోనుద్వారా మా వాళ్ళకు తెలిపాడు. తక్షణమే వాళ్లను చూసిరావడం మంచిదని మా వాళ్లు నిశ్చయించుకుని వాళ్లవూళ్లోనుంచి మూనిచ్ మహానగరానికి ప్రయాణమయ్యారు.

శనివారం, ఆదివారమూ ఆఫీసులకు సెలవురోజులు. ఖైదీలను చూడాలన్న ఆఫీసర్లనుంచి అనుజ్ఞపత్రం అత్యవసరం. ఆఫీసులు కట్టివేయటం మూలాన ఆ పత్రం లభించడం బ్రహ్మాండం. సోమవారం వరకు ఆగాలి ... ఈ లోపుగ ఏమయినా అయిపోవచ్చు! అలా ఏమయినా అయిపోయిందా ఆ అగాధంనుంచి బయటపడటంకూడా అంత సులభమైనపనికాదు. ... ఇదే మా నాన్నను కీల్చి పిప్పి

చేస్తూవున్న సమస్య. కాని అలాటి పరిస్థితుల్లో ఏం చేయగలుగుతారు? కొంచెం వోపికపట్టి సోమవారంవరకు ఆగిపోవటమే అన్ని విధాల మంచిదనుకున్నారు. రష్యా యుద్ధరంగంలోవున్న మా చిన్నితమ్ముడు వార్నెర్ కూడా ఆ సమయానికి శెలవుమీద ఇంటికి వచ్చాడు. వాడికి నాజీల తత్త్వం బాగా తెలుసు. కాని వాడుకూడా వాళ్ల దుఃఖములో పాలుపుచ్చుకోటంతప్ప మరేం చేయగలుగుతాడు?

సోమవారం వుదయాన్నే అందరూకలిసి మ్యూనిచ్ నగరానికి వచ్చారు. వాళ్లను కలుసుకోనటానికి శనివారంనాడు మా వాళ్లకు టెలిఫోనుచేసిన విద్యార్థి ప్లాటుఫారంమీద ఆదుర్దాతో వేచివున్నాడు. మా వాళ్లంతా బండిలోనుంచి దిగారో లేదో, ఆదరాబాదరాతో వాళ్ల దగ్గరికి బిక్కమొఖం వేసుకుంటూ వచ్చి "ఈ తతంగాన్నంతా చప్పచప్పన పూర్తి చెయ్యటానికి ప్రత్యేకంగా నియమింపబడ్డ న్యాయమూర్తులు ఇంకో నిమిషంలో సమావేశమవబోతున్నారు. వాళ్లు ఎలాటితీర్పు చెప్పినా చెప్పవచ్చు. దానికి అడ్డురావటానికి ఎవళ్లతరంకాదు. అన్నిటికీ మనం తయారుగానే వుండాలి." అని అన్నాడు. ఆ మాట విన్నాక మా వాళ్లు ఎలా హడలిపోయారో ఇక మాటలతో చెప్పాలా! అమ్మకు ధైర్యం సాహసంవుంది. కాని యీ క్లిష్టసమయంలో వాటినంతా పూర్తిగా మరచిపోయింది. నోటినుంచి ఏదో చెప్పబోతుంది. ఆ మాట అంత సులభంగా పెగిలి వస్తేనా? ... ముచ్చెమటలు. గడగడ వణికిపోతున్నది. "అంటే వాళ్లకు వురిశిక్ష తప్పదంటావా?" భయాందోళనతో విద్యార్థి ముఖంకేసి ఆతృతతో ఆదుర్దాతో చూస్తూ అడిగింది.

పాపం! ఆ అబ్బాయి ఏమని జవాబియ్యగలుగుతాడు? ఆవిడ దుర్భరావస్థని కళ్లారచూస్తూ "నా దగ్గరే ఈ సమయాన ఒక్క బాంబు వుండిందా...... నాపనికి తోడు నీడగా వుండటానికి ఇద్దరు ముగ్గురు స్నేహితులు ఈ సమయాన్నే నాకు అండగా వుండగలిగారా ... కోర్టుసుధ్వంసం చేసి వుండే వాణ్ణి. వాళ్లవుచ్చుల్నించి మన వాళ్ళని బయటికి లాగేసి దేశపు సరిహద్దులను దాటించి మరోచోటికి సురక్షితంగా పంపి వుండేవాణ్ణి... కాని అంత అదృష్టముంటేగా!" వెలవెలబారిపోతూ అన్నాడు ...

అందరూ కలిసి న్యాయస్థానానికి వచ్చారు. లోపల విచారణ అప్పటికే ప్రారంభమయింది. ప్రేక్షకులు ఆ సమయానికి ప్రత్యేకంగా ఆహ్వానింపబడిన నాజీ ప్రతినిధులే. న్యాయమూర్తులు ఎర్రదుస్తుల్ని ధరించివున్నారు. ముఖ్యన్యాయాధిపతి వాళ్ల మధ్యనికూచుని నడపాలసిన భారతాన్నంతా అదురూ బెదురూ లేకుండా నడుపుతూ వున్నాడు.

న్యాయమూర్తులకి ముందర ముగ్గురు నేరస్థులు వాళ్లకు ప్రత్యేకంగా అమర్చబడ్డ స్థలాల్లో కూచుని వున్నారు. న్యాయమూర్తులు ముఖ్యంగా ప్రధాన న్యాయమూర్తి వాళ్ళని హడలగొట్టటానికి ప్రశ్న పరంపరలను దయాదాక్షిణ్యం అనేది పూర్తిగా మరచే కురిపిస్తూవున్నాడు. ముద్దాయిలకు వాళ్ల మార్గం బాగా తెలుసుగా! ... అంచేత ఈ నాటకానికేమాత్రం భయపడలేదు. న్యాయమూర్తులు అడిగిన ప్రశ్నలకు సూటిగా, వాడిగా జవాబులనియ్యటానికీ ఏమాత్రమూ వెనకంజవేయలేదు. అందరి కన్న సోఫీని గందరగోళపరచటానికి జడ్జీలు చేస్తూవున్న తంతు ఇక చెప్పాలా! సోఫీ సహజంగా మితభాషి. వాళ్లు కురిపించే ప్రశ్నపరంపరలకు వోపిక పట్టలేకపోయింది.

"మాలాటి ఆశయాలు ఆదర్శాలు, భావాలూ కలవారు ఈ దేశంలో ఎంతోమంది కలరు. కాని మాకు మల్లె వాళ్లు వీటిని నిర్భయంగా వ్రాయటానికీ, చెప్పటానికో అంత ధైర్యంమాత్రంలేదు. దానికి కారణం ఏమిటో నేను చెప్పటం అనవసరం కదూ!" అని చప్పున అనేసింది. ఆ మాటకు ప్రధాన న్యాయమూర్తి చిర్రెత్తిపోయాడు. చీవాట్లు

పెట్టి కూచోమని గద్దించటానికీ ఏమాత్రమూ తటపటాయించలేదు. ఈ మాటలను వింటూవున్న ప్రేక్షకులలో రేగిపోతూవున్న వెర్రికోపం సంగతి ఇక చెప్పాలా?... ...

మా వాళ్లు లోపలికి అడుగెట్టేటప్పటికి విచారణ పూర్తిఅయింది. జడ్జిమెంటు చెప్పటానికి న్యాయమూర్తులు వాళ్ల స్థానాలనుంచి లేచి నిలుచున్నారు. వాళ్లిచ్చిన జడ్జిమెంటు ఏమిటో ఇక చెప్పాలా!

... ఆ కఠోరపు మాటవిన్నదోలేదో అమ్మ స్తంభించి పోయింది. ఒక్క అమ్మ ఏమిటి? హాల్లోవున్నవాళ్ళంతా ఆశ్చర్య చకితులయ్యారు. ఇంత కఠినశిక్షను, ఇలాటి నేరాలకు ఇంతచిన్న వయస్సులోవున్న వాళ్లమీద అమాంతంగా ప్రయోగిస్తారని కలలోకూడా అనుకోలేదు! ... నాన్న పిచ్చిధైర్యంతో కొంతసేపువున్నాడు. కాని ఎంత కాలం అలావుండగలుగుతాడు? పిల్లల ధైర్యసాహసాదులకు అహోరాత్రాలూ గర్వపడుతూవున్న నాన్న ఇక ఆగలేక పోయాడు ముఖ్యంగా అమ్మ పరిస్థితులని కళ్లారచూస్తూ వున్నాక ... "వాళ్లు ఎలాటి జడ్జిమెంటు ఇచ్చినా దానికి జడ్జిమెంటు ఇచ్చేస్థానం మరొకటివుంది. అదే అంతా చక్కబెడుతుంది" అని అంటూ అమ్మను వూరడించటానికి శతవిధాలా ప్రయత్నిస్తూవున్నాడు. అమ్మకూడా నాన్నలాటిదే ఇలాటి క్లిష్టపరిస్థితుల్లో! తను అలా స్తంభించిపోయివుంటే తరువాతి సంగతి ఎవళ్లు చూసుకుంటారు? తను అలా దిగాలుపడుతుంటే నాన్న బాధపడుతాడు. అంతకన్నా ముఖ్యంగా, వాళ్లే ... ఆ శిక్షను అనుభవించబోయె తమ్ముడూ, చెల్లీ వింటే వాళ్ళబాధ ఎలా వుటుందో అవిడకు తెలియదా ......

ఇకముందు చేయాలసిన పనిని చూసుకోటం అత్యవసరమని నాన్నతో చెప్పింది. వాళ్ళని క్షమించమని పై అధికార్లకు విజ్ఞాపనం పంపుకుంటేనో? అలావిజ్ఞప్తిచేసుకున్నా అధికారవర్గం వినేస్థితిలో వుంటేగా! అయినా ప్రయత్నంచేయటమే మంచిదని నాన్నతో అన్నది. ఆయన తలనూపాడు ...

ఆ సమయాన్నే హాన్స్‌ని, సోఫీని హాలులో నుంచి బయటకు తీసుకుని వెడుతున్నారు. వాళ్ళ దృష్టి అంతా మావాళ్లమీదే! హాన్స్‌కి ధైర్యంఅంటే, పిచ్చిధైర్యమే! అలాటి విషాదావస్థలోకూడా తొణక్కుండా, చెణక్కుండా వున్నాడు. అమ్మ కేసిచూస్తూ "ధైర్యంగా వుండాలసిన బాధ్యత నీదేనమ్మా! ఇక వెనుకకు తిరగటం అనేదే వుండకూడదు" అని మెల్లగా అంటూ నడుస్తున్నాడు. ... అవును, హాన్స్ అన్నది నిజమే. అక్షరాలా నిజమే! ఇక వెనుకంజవేయటం అనేది ఎలా? ఈ ప్రభుత్వం దేశానికి, ప్రజాకోటికీ, చిచ్చుపెట్టింది. దాన్ని ఆర్పటం ఎవళ్ళతరం? మండి, మసిఅయిపోవాలని విధి వ్రాసివుంటే మనం ఆ వ్రాతను మార్చటానికి వీలుంటుందా?

హాన్సుతో, సోఫీతో ఈ వురిశిక్షను ప్రశాంతంతో ఆహ్వానించిన క్రిస్టల్‌ను చూసేటప్పటికి అమ్మ ఆశ్చర్య చకితురాలయింది. హాన్సు సోఫీల కన్నా, క్రిస్టల్‌ని న్యాయమూర్తులు ఎంతో వేధించారు, వాళ్లకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పి, కఠిన శిక్షలోనుంచి బయటపడమని. కాని క్రిస్టల్ పిరికివాడా! వాళ్ళకు వెయ్యింతలమించినవాడే తనుపట్టిన పట్టును సాంతంగా కొనసాగించటానికి. ప్రధాన న్యాయమూర్తి భీకర దృష్టి, ఏవగింపు కళ్లారచూసేతీరాలి. క్రిస్టల్ దగ్గరనుంచి సంజాయిషీని కోరుతూవున్న సమయాన! ... "నువ్వెందుకు ఆ నరకకూపంలోకి వెళుతావు? వాళ్ళ ప్రోత్సాహాన ఇలా ఈ పప్పులో దిగిపోవాలసి వచ్చింది అని చెప్పు. దాంతో నిన్ను క్షమిస్తాము. ఇకహాయిగా జీవించవచ్చు, ప్రశాంతంగా ఆలోచించుకో" అని నయాన భయాన సలహా ఇచ్చాడు ప్రధానన్యాయమూర్తి. కాని వాడి పట్టుదల వాడిదే. దాన్ని ఎవళ్లు చెడగొట్టగలుగు

తాడు... కోర్టుహాలులోనుంచి వాళ్ళు వెంటనడుస్తూ వున్న సమయాన ఆ దివ్య విగ్రహాన్ని కళ్లారచూసే తీరాలి. దాంతో మనకూ చెప్పరానంత శక్తితో ముందంజ వేయగలుగుతాం.

◆ ◆ ◆

III

విచారణ పూర్తి అయిందోలేదో, దాంతో న్యాయమూర్తుల జడ్జిమెంటుకూడా చదువబడ్డదో లేదో, అధికారులు "నేరస్థుల్ని" కోర్టుభవనంనుంచి తిన్నగా వూరికి కొంతదూరంలో, స్మశాన స్థలానికి చేరువననున్న మరో కారాగారంలోకి తీసుకుని వెళ్లారు. జడ్జిమెంటు ప్రకారం ముగ్గురు నేరస్థులకి- అంటే హాన్సు, సోఫీ, క్రిస్టలులకు - వురిశిక్ష విధింప బడ్డది. ఆ శిక్షను సాధ్యమైన త్వరలో చడీ, చప్పుడూ లేకుండా ఆచరణలో పెట్టాలనికూడా న్యాయమూర్తులు తీర్పులో సూచించారు. ఇలాటి శిక్షను అనుభవించాలసినవాళ్లని ఈ జైలులోకి గబ గబ తీసుకునిరావటం ఆ రోజుల్లో పరిపాటి అయి పోయింది. ... ...

వురిస్తంభానికి తీసుకునిరావటానికిముందు, నేర స్థులు కొంతసేపు వూపిరిపీల్చుకోనటానికి వ్యవధినీయ బడుతుంది. ఆ సమయంలో నేరస్థులకు వాళ్ల ఇండ్లకుగాని, దగ్గర బంధుమిత్రాదులకు వుత్తరాలు వ్రాసిపంపటానికి స్వాతంత్ర్యంవుంది. దగ్గర బంధువు లను కలసిమాట్లాడటానికికూడా ఇలాటి పరిస్థితుల్లో అవకాశంకూడావుంది.

అందరూ వాళ్లవాళ్లకు వుత్తరాలను చప్పచప్పన వ్రాశారు జైల్లోవాళ్లు అమర్చిన గదులకు చేరిన తక్షణాన్నే ... సోఫీకి ఇంకో కోరికవుంది. తన వాఙ్మూలాన్ని సేకరింటానికి నియమించబడ్డ అధి కారిని మరొకసారి చూడాలని. అలాచూసి, అతనితో కొన్ని సంగతులను చెప్పితే, ఇతరచోట్ల కారాగార శిక్ష ననుభవిస్తూవున్న కొంతమంది విద్యార్థి మిత్రుల విడుదలకు అవకాశం వుంటుందికూడా. ...

క్రిస్టల్‌కి "నా" అన్నవాళ్లు - వాళ్ల అమ్మ మాత్రమే. ఆవిడ ఈ శిక్షను విన్నాక ఎంత హడలి పోతూవుందో ఇక చెప్పాలా! ... అమ్మకే తన కడసారి వుత్తరాన్ని క్రిస్టల్ రాశాడు. "అమ్మా! నాకీ సేవచేయటానికి ఈ జన్మను ప్రసాదించినందుకు ఎంతో కృతజ్ఞుణ్ణి. నా ధర్మాన్ని యథార్థంగా నిర్వర్తించాను. అదే నన్ను భగవానుని సన్నిధికి సూటిగా తీసుకుని వెళ్లగలదు. ఈ రహస్యాన్నే నెమరువేస్తూ వుండాలి యిలాటి పరిస్థితుల్లో. ఇలా చేస్తేనా నా ఆత్మ తృప్తిపడుతుంది. నీ గుండె కుదటబడుతుంది. ... ... ..." అంతకన్నా మరేసంగతి అమ్మకు తెలుపగలుగుతాడు ఈ వీరుడు!

అమ్మా, నాన్నా హాన్స్ సోఫీలను ఆ రోజు సాయంకాలాన్నే, జైల్లో చూడడానికి అధికార్లు అనుమతినిచ్చారు. ... ...

హాన్స్‌ని మొట్టమొదట మా వాళ్లని కలిసికొని మాట్లాడటానికి తీసుకునివచ్చారు. హాన్స్‌మీద పడ్డది పెద్దపిడుగు. అయినా దానికి భయపడి హడలిపోయే ఘటమైతేగా! అమ్మను నాన్నను చూశాడోలేదో, హాన్స్ వాళ్ల దగ్గరికి గబగబవచ్చి నమస్కరించాడు. "ఎవళ్లమీదా నాకు కోపం లేదు. వాళ్లని గురించి అన్యథా తలంచనుకూడా. నా పని నేను చేశాను. అలా చేసినందుకు ఎంత గర్వపడుతున్నానో చెప్పటం అనవసరంకదూ!" అని అన్నాడు హాన్స్ వాళ్ల కళ్లలోకి తదేక దృష్టితో కొంతసేపుచూస్తూ - వాళ్లకు ఆ విధంగా ఇయ్యాలసిన ధైర్యాన్నిఇస్తూ. నాన్న ఒణకిపోతు న్నాడు హాన్స్ మాటలనివింటూ. వాడి చేతుల్ని గట్టిగా నిమురుతూ "వీళ్లు ఇలా తీర్పుచేశారు. క్షాని మరో కోర్టువుంది. అక్కడ ఇచ్చేతీర్పే శాశ్వ తంగా వుండిపోతుంది" అంటూ కళ్లతడిపెట్టు కున్నాడు. ... వాడి స్నేహితులని అడిగానని చెప్పు మన్నాడు అమ్మతో. ... అక్కడినుంచి చప్పు చప్పన లోపలికి వెళ్ళాడు. ఇక కొంతసేపు వాళ్ళ

దగ్గరనుంటే ఎలా బాధపడాలని వుంటుందో హాన్స్‌కు బాగా తెలుసుగా! ...

అక్కడినుంచి సోఫీవున్న జైలుభాగంవైపుకు తిన్నగా నడిచారు. వార్డన్ వెంట సోఫీ అమ్మా, నాన్నలకోసం ప్రేక్షకుల గదిలో ఆతృతతో వేచి వుంది. హాన్స్‌కుమల్లె ఖైదీ దుస్తులనుకాక, స్వంత దుస్తులనే ధరించివుంది. నడిసముద్రంలో మునిగి పోతూవున్నా, అదురూ బెదురూలేక మామూలు మాదిరిగానుండి, మావాళ్ళని ఎంతో ఆప్యాయంతో పలకరించింది. కబుర్లు చెప్పటమంటే సోఫీకి సరదా. తనివితీరా నవ్వుతుంది. ఈ కష్టాల్లోకూడా ఆ సహజ సంపద మారిపోలేదు. దానికి మిఠాయి అంటే ప్రాణం. అమ్మ తెచ్చియిచ్చిన పదార్థాలని ఆనందంతో పుచ్చుకుంటూ "మధ్యాహ్నం భోంచేయలేదు. తగిన సమయానికే వీటిని తెచ్చావు; వీటితో ఆకలితీరిపోతుంది." మందహాసంచేస్తూ అన్నది. హాన్స్‌కిమల్లె ఎంత ధైర్యం సోఫీది! "అమ్మా! నా కోసం బెంగపెట్టుకోవద్దు. సముద్రంలో అలలు లేకెత్తుతూ వుంటాయి. అది సహజం. అంచేత ఈ అలా అవసరం. అలలులేకపోతే సముద్రపు వాతావరణమే స్తంభిస్తుందికదూ ..." అంటూ నవ్వింది. ఆ అంతరార్థం అమ్మకు తెలుసు, నాన్నకు తెలుసు. వాళ్ళు అక్కడ వున్నంతకాలమూ ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పుకుంటూ కాలక్షేపం చేశారు. అమ్మాయి దగ్గర సెలవుపుచ్చుకుని బయటికి వచ్చేశారు. ... ... అక్కడి తరువాతి గాథను జైలువాళ్లు మాకు ఇలా తెలిపారు!

"ఎంతో ధైర్యం, సాహసం, ఓర్పు, శక్తివుంటే గాని అలా ఆ పరిస్థితులను ఎదుర్కొనగలుగుతారు. ... వురిస్థంభం దగ్గరకు పోవటానికి ముందు సిగరెట్లని కాల్చటం మంచిదని వాళ్ళకు సలహా ఇచ్చారు. ఎందుకు ఇలా అంటున్నామో వాళ్ళకు బాగా తెలుసు. అంచేతనే" ఇంకో క్షణంలో స్వర్గ సుఖాన్ని అనుభవించబోతున్నాం. అటువంటి సమయంలో ఈ లాంఛనాలన్నీ అనవసరం. బొత్తిగా అనవసరం" అని క్రిస్టల్ అన్నాడు. మా వంటి వాళ్ళకు చావంటే వెర్రెత్తిపోతాం. కాని వాళ్లో! చావుకోసం అంత ఆనందంగా వేచివుండటం చూశాక ఆశ్చర్యపడిపోయాం. ఈ సంగతి జైల్లో అందరికి చప్పున తెలిసిపోయింది. బొమ్మలకుమల్లె అందరూ స్థంభించిపోయారని చెప్పటం అనవసరం."

వురిస్తంభం దగ్గరకూడా హాన్స్, సోఫీ, క్రిస్టల్ చూపిన ధైర్యం ఇక చెప్పాలా! చావబోతూ "స్వాతంత్ర్యం - అందరికీ ఇదే కావాలి. దీన్నే మేము వాంఛించేది" అనే నినాదం మారుమ్రోగిపోయింది ఆవరణంలో. బయటవున్నవారు విన్నదీ ఈ నినాదాన్నే. మతాచార్యుడు ఆ సమయాన వాళ్ళ దగ్గరే వున్నాడు. ఆయనా వీళ్ళ ధైర్య సాహసాదులనుచూచి ఆశ్చర్యమగ్నుడయ్యాడు. అప్పుడే సూర్యోదయమవుతున్నది. మతాచార్యునికి ఆ దృశ్యాన్ని చూపుతూ "అలాగే అంతా బాగుపడుతుంది ఇలా ఎప్పుడూ సూర్యోదయం అవుతూవుంటే" అని మందహాసంచేస్తూ హాన్స్ అన్నాడు.

# శ్రీ హితైషిణీమండలి, బాపట్ల రజతోత్సవము

బాపట్ల స్త్రీహితైషిణీమండలి రజతోత్సవము జూలై నెల 26, 27, 28 తేదీశుక్ర, శని, ఆదివారములలో అత్యంతవైభవోపేతముగా జరుపబడినది. మొదటిదినము రజతోత్సవ సభకు విజయవాడ గవర్నమెంట్ హాస్పిటల్ డాక్టరు తోలేటి కనక రాజుపంతులుగారి సతీమణి, సేవా పరాయణి శ్రీమతి శేషమ్మగారును, రెండవ దినము బాలికోత్సవసభకు శ్రీ శ్రీ శ్రీ మాతాజీగారును, మూడవదినము, సారస్వతసభకు నిడుబ్రోలుకాలేజీ ప్రిన్సిపాల్ శ్రీ గుఱ్ఱము వేంకటసుబ్బరామయ్యగారును అధ్యక్షత వహించి కార్యక్రమమునడపిరి. ప్రథమ దినము ఉదయము మండలిభవనమున శ్రీ సీతారామ సహస్రనామ పూజయు, శ్రీ సింగరాజు నాగభూషణ రావుగారిచే ప్రహ్లాదకథా సంకీర్తనమును జరుపబడెను. సాయంత్రము అయిదు గంటలకు ఆరంభమైన సభలో అధ్యక్షురాలి ఉపన్యాసమును కార్యదర్శిని నివేదికయు, శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి గారి ఉపన్యాసమును, అయిన తరువాత గుంటూరు వాస్తవ్యులు బొడ్డపల్లి జానకి, హేమలత సోదరీమణులు పాటకచ్చేరి చేసిరి. రెండవదినము బాలికోత్సవము. ఉదయము శ్రీరామపూజయు, బాలికల సంగీత ప్రదర్శనము జరుపబడినవి. సాయంత్రము అధ్యక్షురాలి ఉపన్యాసానంతరము శ్రీ అయ్యగారి సోమేశ్వర రావుగారి వీణాకచ్చేరియు, పి. సుగుణ ఫ్లూటుకచ్చేరి జరిగినపిమ్మట, చిరంజీవులు శ్రీమతి హనుమద్దెలి, పాలపర్తి ఆదిశేషు, తంగిరాల కమల, ఆర్ సరస్వతి, చంద్ర జానకి అనుబాలికలు తోడు దొంగలు అనునాటకమును, గిడుగు పాపాయమ్మ, పాలపర్తి ఉమాదేవి, కన్నెక, పోలూరి అనసూయ, పులిపాకసుగుణ, యనమండ్ర కల్యాణి,కోనాఅరుణ కోనాలక్ష్మి అను బాలికలు ఎదురు ప్రశ్నలు అనునాటకమును, హను, మీనాకుమారి గోపిక కృష్ణుల నృత్యమును, గిడుగు మీనాకుమారి, ఆర్ జానకి పాములవాడు పాములది అను నృత్యమును, మీనాకుమారి సోదెయు బొడ్డుపల్లి వారి చిరంజీవి వివిధనృత్యములను ప్రదర్శించిరి.

ఉదయము శ్రీరామ పూజయు, కొమాండూరి రామానుజాచార్యులుగారి పురాణకాలక్షేపము జరిగెను. మూడవ దినము సారస్వత సభలో ప్రథమమున అధ్యక్షుల ఎన్నికయు, శ్రీ సింగరాజు నాగభూషణరావుగారికి వారి సన్మాన సందర్భమున నూతన వస్త్రములున్ను సన్మానపత్రము, కళాతపస్వి అను బిరుద ప్రదానమును జరిగెను. పిమ్మట అధ్యక్షుల ఉపన్యాసమును శ్రీ ధర్మాలశాస్త్రిగారి, భారతీయసంస్కృతి — స్త్రీ లస్థానము

అను విషయముపై ఉపన్యాసమును జరిగెను. పిమ్మట బాలికలచే నయాపైసాదండకము, బ్రహ్మంగారి తత్వము, పుత్తడిబొమ్మ పూర్ణమ్మ గేయనాటికప్రదర్శనమును, వేమూరి వేంకటలక్ష్మి భరతనాట్యప్రదర్శనమును, శ్రీసింగరాజు నాగభూషణ రావుగారి బల్లహుడు ; విద్యానాథుడు పేరిగాడు పాత్రల ఏకపాత్రాభినయము జరిగెను. అధ్యక్షులవారికిని, శ్రీ సుబ్బరామ శాస్త్రిగారికి ఖద్దరు శాలువలును, మండలి సంగీతోపాధ్యాయులు శ్రీ అయ్యగారి సోమేశ్వరరావుగారికిని, కుట్టు ఉపాధ్యాయిని కొమ్మమూరి వేణమ్మగారికిని నూతన వస్త్రములును, మూడుదినములు వినోద ప్రదర్శనములలో పాల్గొనిన బాలికలకు రజతపాత్రలు, స్టీలు పాత్రలు, అద్దములు పుస్తకములు బహూకరింపబడెను. కార్యదర్శిని వందనములతోను, జనగణమన జాతీయగీతగానముతోను మూడుదినముల రజతోత్సవ కార్యక్రమము సమాప్తమయ్యెను. ఉత్సవము మూడుదినములు స్త్రీలు పురుషులు అసంఖ్యాకముగావిచ్చేసి కార్యక్రమము తిలకించి ఆనందించిరి.

నాల్గవదినము 29-7-57 మండలి సభ్యురాండ్రకు అల్పాహార విందును, మండలి అధ్యక్షురాలుగా ఉండి గ్రామాంతరము వెళ్లనున్న, వెలిదండ రాజ్యలక్ష్మమ్మగారికి సహాయకార్యదర్శినిగా ఉండి గ్రామాంతరము వెళ్లనున్న కామరాజు వెంకటలక్ష్మమ్మగారికి, సత్కారసభయు, రజత పాత్రిబహూకరణమును జరుగుటతో నాటిసభ ముగిసెను.

కనుపర్తి వరలక్ష్మమ్మ,
కార్యదర్శి



# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు.



(గత సంచిక తరువాయి)

౯

మాణిక్యములచేత మహితమై వెలుఁగొందు
శ్రీపాదుకలు గల్గు శ్రీ శుభాంగ!
బృందారకాళి, నీ సుందర చరణార
విందముల్ సేవించు చుందు రెపుడు
అంబు జచ్ఛత్ర రథాంగధ్వజంబులు
శంఖ, దంభోళి, పాశాంకుశములు
మత్స్య చిహ్నంబులు మాన్యమైయుందుండు
బ్రహ్మేంద్ర దేవాది భక్త వరుల
శీర్షపు, కిరీటకాంతులు శ్రీనివాస!
నీ చరణయుగ్మములయందు నెగడుచుండ
వెలుఁగుచున్నావు; శ్రీరామ! వేదవేద్య
స్తోత్ర మొనరింతు నిన్ను, సంశ్లోక చరిత!

౧౦

కల్గి పురుగోరు పతకంబు కంఠమందు
నుదుటఁ జేర్చుక్కయొక్క సంపదనుగల్గి
శ్రీదిగంబరమూర్తివై చెల్వగాఁగ
నాట్యమొనరించు చున్నవిన్నాణశాలి
బర్బరాలక శోభిత బాలరామ!
నీకు వందన మొనరింతు నిగమవేద్య!

౧౧

శ్రీశ! రఘువంశ వర్ధనా! శ్రీశతాష్ట
పుణ్యతీర్థంబులందు నీ మూర్తి పూజ
కరము శోభించుఁగా; శతక్రతువులందు
నింద్రుఁడును, బ్రహ్మ దేవత లెపుడునిన్ను
భక్తి నర్చించుచున్నారు; భాను చంద్ర
మండలనివాస! కొనుము నమస్సులివిగో!

౧౨

ఇంద్రుని రథమెక్కియే పారుశౌర్య
వీరప్రతాపముల్ వెలయగా, నారి
కర్ణాంతముగలాగి, గాఢంబుగాఁగ
బ్రహ్మాస్త్రముదొడింగి, రణభూమి కంప
మొంది, తుల్లాడగా - బృందారకాది
దివిజులు స్తుతియింప, దేదీప్యముగను
దశకంఠుఁద్రుంచిన - దశరథరామ!
రూక్షేక్షణంబుల, వీక్షింపరాని
తీక్ష్ణరూపము మాని తెలివొందుమయ్య
నానమస్కారంబు - నాథ! శ్రీరామ!
అర్పింతు గొనుమయ్య! హరి! హృషీకేశ!
రక్షింపు మాధవా! రామ! ముకుంద!

౧౩

నీల మేఘంబుల - మేలిమి శోభ
నీలోత్పలంబుల - నిగనిగలింద్ర
నీలాల కాంతులు - నీశరీరంపు
కాంతికి సాటియే ? కమనీయగాత్ర !
సీతతోఁగూడిన శ్రీరామ చంద్ర !
దానవ మర్దనా, దశరథ రామ !
ఇంద్ర రక్షణమునందే పాఱశ్రద్ధ
వరలిన వాఁడవు ; భజియింతు నిన్ను.

౧౪

పూర్ణచంద్రుని వంటి మోమునుగల -
వాఁడు, ముక్కంటికిష్టుఁడై పొసగువాఁడు
స్ఫురిత పటు ప్రఖ్యాత భూరిబాణము -
వాఁడు, రావణు బోరిగొన్న ప్రస్తుతయశుఁడు
రత్నవిరాజిత రమణీయ చరణుఁడు, -
వితరణ జితకల్ప వృక్షశతుఁడు
లక్ష్మికిప్రియమైన లలితరూపమువాఁడు, -
ద్వేష రాగంబుల విడుచువాఁడు
ప్రజలకెల్ల సులభవశ్యుఁడై యున్నాఁడు
భవము బాపు నట్టి బాంధవుండు
నీరజాక్షుఁడతఁడు తారక రాముండు
యతని భజనసేతు ననుదినంబు

౧౫

షట్చక్రమున, నివాసంబుగల్గి 'అ' కార
మాది, 'క్ష' కార పర్యంతమ క్ష
ర, స్వరూపుండయి, రత్నకుండలముల
ధరియించి, చిఱునవ్వు చాండవింప
నానందమూలమై, యాపదలను గ్రీష్మ
తాపంబులోఁ బరితాప మొందు
ప్రజలకు మేఘుఁడై, బాధలఁబోకార్చి
దయకు, సముద్రుఁడై తాపమార్చి
భక్తగణమునెల్ల పరిరక్షఁజేసెడి
రామ చంద్ర ! వరద ! రాఘవేశ !
ధర్మహృదయ ! శ్రీశ ! తారకరామ ! నే
భజన సేతునిన్ను భక్తితోడ.

౧౬

శ్రీయయోధ్యకు మధ్యఁ జెలఁగు మంటప
మందు
గొప్పగా మణిపీఠమొప్పి యుండు,
పీఠమధ్యంబున విలసిల్లు 'పద్మక
ర్ణిక' యష్టదళముల నెగడియుండు
'పద్మకర్ణిక' యందు భద్రాసనంబున
శ్రీరామ భద్రుండు చెలఁగియుండు
నిజ సోదరులు, యాంజనేయుండు సుగ్రీవుఁ
డతి భక్తిఁగొల్వగా నలరి యుండు
పాణిపద్మమందు, 'జ్ఞానముద్ర' నుగల్గి
బోధసేయునట్టి పుణ్యమూర్తి
తత్త్వవేత్త బుధుఁడు తారకరాముండు
నను తరింపఁజేయు ననుదినంబు.

౧౭

కుండల, కిరీట, కౌస్తుభమండితుండు
తులసి మాలలును, భుజకీర్తులను గల్గి
పసిడి పుట్టంబు ధరియించి వరలు వాఁడు
రామ చంద్రుండు మముసదారక్షసేయు.

౧౮

అరయ, మూలాధారమాదిగాఁగల యాఱు
పద్మంబులకు పైనఁబరగియుండు
సహస్రంబుగాఁగ, సహస్రారపద్మంబు
దాని మధ్యంబున స్థానమొంది
సంసారపాశముల్ సమయింపఁ జేయుచు
రాజిల్లుచుండు శ్రీరాము మూర్తి
ప్రణవ నాదాంత, చంద్రగళితామృతసిక్త
రూపంబుఁ గొన్న సుశ్లోక మూర్తి
నాదనాదంబులో నుండు నాదమహిమ
కలను, స్థానమైయుండు, మహీసుతాధి
నాథు, శ్రీనాథు, శ్రీరఘునాథు, నీ. య
నాథు రక్షింపఁ బ్రార్థింతు నతులొనర్చి.

౧౯

బ్రహ్మయొసఁగిన వరగర్వబలముచేత
మన్ను మిన్నుఁగానక, యవమానమైన
పనులనొనరించు రావణవంశ గిరికి
తలఁబగులగొట్టు వజ్రాయుధంబవీవు!
రామ! తమ్ములు, దిక్పతుల్, నేమముగను
రావణానుజ వాయుజ ప్రముఖులెపుడు
సేవ సల్పుచు నుంద్రు; సుగ్రీవసహిత!
శ్రీరమాలోల! వరద! రక్షింపుమయ్య

౨౦

అజ్ఞానమనెడి, గాఢాంధకారమునకు
సూర్య స్వరూపుఁడౌ సుందరాంగ!
వనధి మధ్యమునందు వటపత్రశాయియౌ
సీతామనోహరా చిత్ప్రకాశ!
ఆది మధ్యాంతమ్ము లరయ లేవయ్య-నీ
కానత జనకామితార్థకల్ప!
అఖిల జీవంబుల కాది బీజుండవు
అన్ని కార్యంబుల కాస్పదుఁడవు
మతియు, బుద్ధివీవు! వితతశక్తియు నీవు
కవిత వీవు! వ్రాయు కవివి నీవు!
ప్రజ్ఞ వీవ! పనులఁబట్టిద్దలయునీవ!
రామ నిన్నుఁదలఁతు రక్షకొఱకు

(సశేషము)

# కే నో ప ని ష దు

మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం :
డాక్టరు W. రాధాకృష్ణయ్య



(గతసంచిక తరువాయి)

ఇదంతయు మనము, మతమును, సత్యదృఢ భావముతో అనుసరించగలిగి మన మనస్సును శక్తివంతము చేసుకొనిన యెడల సర్వకాల సర్వావస్థలయందును చలనములేని శాంతమును, ఆనందనమును పొందగలము.

ఈ రీతి మతముయొక్క ముఖ్య కార్యము నాత్మ ఆశీర్వాదములను మనము, కనుగొనిన యెడల, దృఢ నమ్మకములో దాని, నన్వేషించి, లాభము పొందగలము. దుఃఖము లన్నిటిని సుఖములుగ మార్చగల, అపజయములన్నిటిని జయములుగ, నష్టములన్నిటిని లాభములుగ మార్చగల, "చింతామణి." "స్పర్శ వేది" వంటి వరముకన్న గొప్ప వరము, మతమువల్ల గాక వేరు ఏ ఉపాయమువల్ల పొందగలము !

## మేల్కొనుడు:-

అట్టి సాత్విక మానవుడు, మర్త్యులలో మానవ దేవుడు. అతడు ఒక ఋషి, మహాత్ముడు. అవతారము. మన పూర్వ మహా పురుషులందరు, అట్టివారే. ఇప్పుడుకూడా మతావలంబిత సత్య పురుషులందరు అట్టివారే. మతము మానవకోటినంతయు శ్రీరామకృష్ణ పరమహంసలుగ, వివేకానందులుగ, శంకరులుగ, బుద్ధులుగ, క్రైస్తువులుగ, మహమ్మద్దులుగ, మార్చగలనని, నమ్మకమిచ్చుచున్నది. అంతకన్న మనము కోరగలదేమి ?

అన్ని మతములు చూపిన మార్గము ఒకటియే. అసత్య అహంకారమునువదలి, దానివల్ల కలిగిన వ్యసనములను వదలుడు. దుఃఖములు, వ్యసనములు అహంకార పిశాచికి చేరినది. దానిని ఆ భగవంతుని పాదములవద్ద ప్రేమతో సమర్పణము చేయుము. సదా విచారముచేత ఈ అహంకారమును, అణిచివేయుము. నిత్యా నిత్య వివేచనవల్ల అసత్య అహంకార స్వప్నము చాలింపుము. నీలోని లోపగుణములన్ని, తొలగించి, సద్గుణములతో పరిపూర్ణత్వమునుపొంది, ఆ అహంకారమును దైవీకారముజేయుము.

మనము మన నిజస్థితిలో శుద్ధ సత్యజ్ఞాన స్వరూపులమని మతము బోధించుచున్నది. నిర్మలానంద స్వరూపులము. అహంకార దోషమువల్ల మనము, అహంకార జనితమగు స్వరూపములని మనము నమ్ముచున్నాము. మనము తెలిసియో, తెలియకయో, ఆత్మ సాక్షాత్కారమునకు మెల్లగా, ముందంజ వేయుచున్నాము. జీవితములో కలుగు వ్యసనముల విచారములవల్ల, మన కలను తొలగించి, దుఃఖములను దూరముచేయు అవకాశము కలుగుచున్నది.

మేల్కొనుడు! లెండు! జాగ్రత్తపడుడు. గమ్యస్థానముచేరువరకూ ఆగకుడు. ఇదియే ప్రతి మతము మనకు బోధించు ప్రబోధ. మతముశాస్త్రముల కన్నిటికిని శాస్త్రము. ఏలన అది పూర్ణజ్ఞానమును తెలియజేయు మార్గము. మన స్వంత నిజస్వరూపము, ఆత్మ, సచ్చితానంద, పరిపూర్ణస్థితిని తెలుపు శాస్త్రము.

## వేదాంతము ! త్యాగమతము:-

మనమత గ్రంధములలో మిక్కిలి ముఖ్యమైన కఠోపనిషత్తునందుగల కథలలో సత్యాన్వేషణ పరుడైన బాలుడు యమునిసదనముచేరి, యమునితో ముఖావలోకనా ప్రశ్నలతో బ్రహ్మజ్ఞానమును

గురించి విచారించగలిగెను. వేదాంతమార్గస్థులందరును ఇట్టి శక్తిపరులై యుండవలెను.

నిజస్థితిలో చావుబ్రతుకులు పరస్పరసన్నిహితముగా యుండుటబట్టి వాటియొక్క తారతమ్యము కనుగొనుట చాలకష్టతరముగా నున్నది. మరణాంతముగూడ సత్యాన్వేషణ సాగించుట నిజమైన జీవితమని పొగడదగియున్నది. దృఢవిశ్వాసము, పట్టుదలగల సాధకునికి మరణమే లేదు.

ఈ అభిప్రాయముతోనే మన పూర్వీకులు, శాస్త్రకారులు, మహఋషులు, సాధువులును, అవతారములును, అమరులని చెప్పియున్నారు. శ్రీరామకృష్ణులు, భగవాన్ శ్రీరమణమహర్షి, శ్రీరాములు, శ్రీకృష్ణులు, అమరులే. యేలయన వారు జీవిత తత్వమును తెలిసి ఆ తత్వసందేశమును, నెలకొల్పుతునే జీవితమును నడిపిరి. వారిస్థూలదేహములు, జీర్ణములైనవి కాని వారు జీవించియున్నారు.

## ఇది యెట్లు సాధ్యము:-

ఒకానొకప్పుడు పొల్లాటు ఉప్పుదుట్ట వాసియైన సన్నని చిక్కిపోయి దుఃఖముతోనున్న చీమయొకటి, కోయంబత్తూరులో చెక్కెర రాశిలో నివశించు, బలసి, పూరినశరీరముగలిగి ఆనందముతో తులతూగుతున్న చీమను కలుసుకొనెను. పొల్లాటునక్షామము ఆవరించెనా యేమియని కోయంబత్తూరు చీమ స్నేహితుని యవస్థవిచారించెను. మాటలానంతరము పొల్లాటుచీమ కొన్ని దినములు కోయంబత్తూరు స్నేహితుని ఇంటిలో అతిథిగా యుండనిశ్చయమాయెను. అందు పొల్లాటునుంచి బయలుదేరునపుడు తనకుగల ఆహారముకొంత తనతో కూడ తీసుకొని ఆ చీమ బయలుదేరి కోయంబత్తూరు చేరియుండెను. కొన్నిరోజులు జరిగెను. కాని పొల్లాటుచీమ అవస్థలో మార్పేమియు కన్నబడలేదు. దానిదుఃఖము నివారణకాలేదు. కోయంబత్తూరు చీమకు చాలా విచారముగలిగి కారణము అడిగెను. దానికి బదులు పొల్లాటుచీమ "స్నేహితుడా ఇచ్చట అన్ని సౌకర్యములు యున్నవిగానీ మీ అన్నము మాత్రము నాకు రుచించడములేదు" అనిచెప్పెను. స్నేహితునికి దిగులుకలిగెను. సర్వప్రాణులకు తీపికరమైన చక్కెరయూ అథితికి రుచింపలేదు. ఇక అతనికి ఏమిరుచింపగలదు అని ఆలోచించెను. పరిశీలించగా పొల్లాటుచీమ తాను నోటిలో కరచుకొని వచ్చిన ఉప్పుపెళ్ల ఇంకాకొంచము కరచుకొని యుండెను. ఆ పెళ్లను వుమ్మివేయుమని బలవంతపెట్టగా అప్పుడు ఆ చక్కెరరాసియొక్క తీపి దానికి పూర్తిగా తెలిసి పరమానందము కలిగెను.

మన మందరమును ఆ పొల్లాటు చీమకు సరిసమానులమే. "హృదయములోనున్న నీచభావములను ఉప్పును ఉమ్మివేయుడు. ఆత్మ సాన్నిధ్యమునందలి, చక్కెరతీపిని ఆస్వాదించి, దివ్యజీవితమును నడుపుడు. సర్వము ఆనందముకాని వేరుకానరాదు. భయములపరిమితుల, ఆశాభంగములను తొలగింపుడు. అనంత ఆనందజీవితమును అనుభవింపుడు." ఇదియే వేదాంత ప్రబోధ — త్యాగమతముయొక్క సారము.

ఉప్పుపెళ్లల సహవాసమును తొలగించవలెను చక్కెరరాసులలో సుఖింపగల సౌభాగ్యము వెంటనే కలుగగలదు

మనలో రెండు శక్తి స్వరూపములున్నవి. మానవత్వము, దేవత్వము. మనుష్య జన్మమునకు, రాగల హక్కు ఏమన పరిమితికి లోనైన అనుభవములను పొందుట, మరణించుట. దేవత స్వరూపము పరిమితికి మించినది. మరణములేనిది. (ఆద్యంత రహితము. శాశ్వతము.) మనలోగల అసత్య గుణముల ప్రభావమువల్ల మానవత్వముపొందిపొల్లాటు చీమవలె దుఃఖముల పాలగుచున్నాము. మానవత్వమునుండి బంధము తొలగించుకొనిన మనదేవత్వము మరల మనకు ప్రాప్తికాగలదు. ఇది వేదాంతములసారము. ఈ ఉపనిషద్ జ్ఞానయజ్ఞమువల్ల మనము మానవత్వ స్వభావమును నశింపచేసి మనలోనున్న దేవత్వమును సంపాదించుకొనుచున్నాము.

## అహంకారమును చంపవలయును:-

ఇట్లు ఒక శత్రువు, మనలోనే దాగియుండి మన

దుఃఖమునకు శక్తిహీనతకు కారకుడై యుండిన యెడల, అతనిని ఎంత త్వరలో మనము బైటత్రోసి, చంపినయెడల అంత త్వరలో మన జీవిత ఆశయమును పొందగలము.

అట్టి శత్రువు ఎవడు? అన్ని శాస్త్రములు, శృతులు, దానిని అహంకారమని ఏకగ్రీవముగా తెల్పుచున్నవి. ఈ చిన్న "నేను" అను దానిని చంపుడు చంపి జీవించుడు. అహంకారమును నాశనముచేసి దుఃఖముల నివారణ పొందుడు. ఈ అహంకారమునే సంసారి యందురు. దుఃఖకారకు డందురు. అతడే శత్రువు. కనుక అతనిని బాగుగ గమనించి, అతని స్వరూపమును కనుగొనవలెను. మన శత్రువును బాగుగా గుర్తెరిగినయెడల అతనితో యుద్ధము బాగుగా సాగింపవచ్చును.

ఇప్పుడు మీరు ప్రతియొక్కరు ఈ ప్రశ్నను మీరే పృచ్ఛచేసుకొనుడు. ఈ "నేను" అనునది యెవడు? ఈ అహంకార మనునదియేమి? ఈ నేను అను వ్యక్తిత్వము, మన గడచిన జీవిత, ఘటనముల అనుభవములను, స్మరణముద్రలు. అనగా నేను ఫలాని పురుషుని పుత్రుడను ...

ఫలానచోట విద్యనేర్చినవాడను. ఆ చోట నివశించితిని. అతనిని ప్రేమించితిని, అతనిని ద్వేషించితిని. అతనికి విద్యనేర్పితిని-వేయేల- ఇట్టి పరంపర అనుభవములు, ముద్రలు ఘనీభవించి, ఈ నేను అనువ్యక్తిత్వము కలుగుచున్నది. ఇట్టినేను అను ముద్రలో "రాబోవు" ఆశలసమూహముగూడ చేరి యున్నది.

ఈ అనుభవముద్రలు, ఆశల రాసులను ఇంకను శోధించిన ఇవి భూతకాలములోనో భవిష్యత్తు కాలములోనో కలసి సత్యత్వము పొందుచుండుట గమనించగలము. వర్తమానకాలమునకు ఈ ముద్రలకు ఏలాటి సంబంధము యుండుటలేదు. ఈ అహంకారము వర్తమానమున సత్యత్వము గలిగియుండుటలేదు. అదియెల్లప్పుడు భూతకాలవాసనలతోను, భవిష్యత్కాల ఆశలతోనిండియున్నది. అనగా ఆ అనుభవములు జరిగి ముగిసి మరణము చెందినవి. లేక ఇంకను వాటికి, పుట్టుకేలేవుకనుక అవిసత్యము కాజాలవు.

కనుక ఈ అహంకారము, ఉట్టి బూటకము. వ్యక్తిత్వములేనిది. ఒకస్వప్నము. సత్తులేని శూన్యము. పిశాచి, ఒట్టినీడ. మనదుఃఖములు మృత్యుత్వమంతా ఈమననిజస్వరూపమునకు ఆవరించిననీడయే. విచక్షణలేనివారమై ఈ నీడకుగల దుఃఖదోషములంతయు మనదనితలచి, కృంగిపోయియున్నారు. ఈ నీడనుండి దూరముకండు. మీ నిజస్వరూపమును తెలిసికొనుడు. మీలోనదాగియున్న ఘాతకుని చంపుడు. సత్యరామరాజ్యమును హృదయమున నెలకొల్పుడు. ఇది మిక్కిలిప్రేమతో వేదాంతము మీకు ప్రబోధించు సందేశము.

అన్నిమతములు, ఈ పిశాచిని తొలగించుటకు తగుమార్గములు తెలుపుచున్నవి. ప్రతిదివ్యసాధనము ఈ నిస్సారనీడను తొలగించుప్రయత్నమే. అన్నిశాస్త్రములును, ఈ అనిత్య అహంకారమునకు సత్యత్వములేదని తెలుపుచున్నవి.

ఒక ఆవరణశక్తివల్ల ఈ అసత్యనీడ ఆ సత్యస్వరూప ఆత్మను, కప్పుకొనియున్నది. ఈ ఆవరణశక్తి యంతయు మనోవ్యాపారము, ఒకగారడివిద్య. ఉండువస్తువును దానికన్న వేరుదానిగా తెలుసుకొనుటయే ఈ ఆవరణశక్తి, చమత్కారము. దీనికి రజ్జుసర్పదృష్టాంతమే శ్రేష్టమైనది.

చీకటి సమయమున ఒకడు ఒక దారమునుచూచి పామనిభ్రమించి పాముకాటుతనకు సంప్రాప్తమైనదని తపించును. అది పాముకాదు. దారమని అతనితో చెప్పినంతమాత్రమున నమ్మడు. అతనిని ఆపుట్టిన స్థలమునకు తీసుకొని వెళ్ళి ప్రకాశసహాయమున చూపవలయును. అతడు దారమును స్పష్టముగా తెలుసుకొనగలిగిన తోడనే, పాము, దానివల్లకలిగిన కాటుకూడా తొలగిపోవును.

అట్లే మన నిజస్వరూపమును తెలుసుకొనలేక పోవుటచేత, మనలోనే ఈ అహంకారమును, ఆవర

మును కప్పుకొని యున్నాము. ఈ అహంకారముణ ఆత్మ జ్ఞానమువల్ల మనలోనుండీ తొలగగలదు.

## పునర్దర్శనము పొందుడు:-

రజ్జు జ్ఞానమువల్ల సర్పభయము తొలగినరీతి, ఆత్మజ్ఞానమువల్ల జీవభావ దుఃఖరాశులన్నియు, తొలగును. అహంకారమును తొలగించి, మననిజ స్వరూపమైన శాంతిని అనుభవింపవలెను. ఈ అహంకారము, భూతకాల అనుభవతలంపులవల్లను, భవిష్యత్తులను అనుభవింపవలెనను కోరికరాసులవల్లను కలిగినదని తెలంపడమైనది. మరణించిన భూతకాలమును, జన్మించని భవిష్యత్తునువదలి, మనము, మన శక్తి పూర్వకముగ, వర్తమానము మాత్రము, అనుభవించుచు జీవించగలిగినయెడల మనము అహంకారమును, చంపినవారమగుదుము. అహంకార సంపర్కములంలేక ఆత్మలో ఆత్మను నిలిపినయెడల, అదియే సమాధి - అన్ని యోగములు తెలుపుపదవి, గమ్యస్థానము. యోగములన్నియు. సాధకునిలోని అహంకారమును, తొలగించుటలో ముగియుచున్నవి. యోగములు వివిధయోగ్యతలుగల, సాధకులకు వివిధ రీతుల బోధించుచున్నవి. కానీ వాటి ఆశయేమో, ఆత్మ ప్రాప్తియే.

అన్ని యోగములు సాధకునియందు అహంకారమును, నశింపచేయుచున్నవి. జీవభావము తొలగగనే, దైవభావము ఆరంభమగును. "మరల కనుగొనుడు. పునర్దర్శనము పొందుడు." మన నిజ స్వరూపమును జ్ఞప్తికి తెచ్చుకొనెదముగాక. నేను బీదవాడనని, నేను మర్త్యుడను, నేను ధనవంతుడని, నేను సంసారినని, ఈ భావములనుపొందు స్వప్నములను చాలింపవలెను.

మన ముందు వ్యాపించియుండు దీర్ఘనీడల తొలగించవలెనన్న, మన దృష్టిని మన వెనుక ప్రకాశించు, జ్యోతివైపు మరల్చవలెను, ఆ జ్యోతియే మన హృదయాంతరముననున్న జ్యోతి. ఒక్క పర్యాయము, హటాత్తుగా ఆ కార్యము చేయజాలక పోయినయెడల, సులభమార్గమును అవలంబింపవచ్చును. అదియే శరణాగతి. మనము నిలువుగా నిలచినకొలది, మన నీడ మరింత దీర్ఘముగా తోచును. మనము వంగిన నీడ సగము తొలగును. కూర్చుండిన పాతిక భాగమగును. ప్రేమ పూర్వకముగ శరణాగతిభావముతో, సాష్టాంగముగా మ్రొక్కుము. నీడ మాయమగును. మన ఈ అహంకార నీడను ఆత్మ శరణాగతి ఉపాయముచేత నశింపజేయవలయును.

ఈ అసత్య అహంకారమును, నిజఆత్మనుండీ తొలగించవలెను. స్మరణలు, ఆశలు, మననునుండీ తొలగించవలెను. హృదయమునుండి, అన్ని ఆశలను తొలగించవలెను. ఆశారహితపదవియే, శాంత పరిపూర్ణపదవి అహంకార రాహిత్యమే నద్వైతత్వము. ఈ గొప్ప జీవితపదవిని సత్యజ్ఞానమువల్ల, సన్మార్గజీవితమువల్ల పొందుము.

## ఆత్మతో మనకుగల సంబంధము:-

ఉపనిషదులందు, తఱచుగా ఒక పూర్ణజ్ఞానియైన గురువును ఒక పరిపక్వము పొందిన శిష్యుడు ఆశ్రయించునట్లు వినుచున్నాము. అందు ఆ శిష్యుని శారీరక, మానసిక, దైవీక గుణములన్ను పూర్తిగా వర్ణింపబడుచున్నది. ప్రతి ఒకరును అందు ధైర్యవంతులు, వయసుచెందినవారును ఆరోగ్యవంతులుగ తెలుపబడుచున్నది. శారీరక, మానశిక, దివ్యగుణములయందు చక్కని అభివృద్ధిగాంచిన వారిలోనే జ్ఞానతేజస్సు ప్రకాశించుచున్నది బ్రహ్మచర్యము మెరయుచున్నది. మానశికమున, జ్ఞానమున చురుకైన విచక్షణగలవారు. వారి అనుభవములలో కడుజాగ్రత్తగలవారు. తర్కమున వివరణ తీర్మానమున మిక్కిలి విచక్షణగల వారు. ఆ హిమవత్ప్రాంతమున సంఘపరిత్యాగము చేసిన గురువులను ఆశ్రయించిన శిష్యుడు తన జీవితమంతయు దినదిన సంఘటనలను, బాగుగ అనుభవించి, విచారించి తన వివేకముతో జీవితమంతయు వట్టి వృథా - శూన్యము, అర్థములేనిది- దీనికి ఖర్చుచేసిన శక్తికి ప్రయత్నములకు తగు ఫలము ఇందు దొరకుట లేదు అని పూర్తి నమ్మకము పొందినవాడు.

(సశేషము)



# రాధ

శ్రీమతి పవని భ్రమరాంబ

(గత సంచిక తరువాయి)

"పిచ్చితల్లి" అంది తల్లి కన్నవారి బాధ్యత తీర్చుకోడానికి. ఆడుది జన్మించగనే కన్నవారికి బాధ్యత ఏంటో? పుట్టిన తరువాత పూరిమేయరుగదా. వీరికింత విశ్రాంతి ఎందుకు.

రోజులు గడుస్తున్నాయి. రాధకు పదునాల్గవ సంవత్సరం ప్రారంభమయింది. వివాహం స్థిరపడలేదు. విద్యానిమగ్నమైన రాధకీ చింతయే లేదు.

సాంబమూర్తికి రాధ వివాహచింత వ్యాధిరూపంగా బాధించటం మొదలెట్టింది. "ఈడు వచ్చిన బాలిక నింటిలో నుంచుకొనుట"యను మాట తలపుకు వచ్చినప్పుడతని హృదయము ద్రవీభూతమగుచుండెను.

దినములు గడచుకొలది సాంబమూర్తి వ్యాధి వృద్ధియయ్యెను. అప్పుడు భర్త చేరువను కూర్చుండి ఎల్లప్పుడు విలపించుచుండును. రాధ ఈ అనామయమునకు కారణమూహింపజాలక కృశించిపోయెను.

సంస్కృత పఠనము మానివైచెను. ఆమెకీ కల్లోలమున విద్యాసక్తికి తావులేకపోయెను. ఎల్లప్పుడు ఇంటియందుండి తల్లిదండ్రులకు ధైర్యము కూర్చుటయే ఆమె పని.

ఆ దంపతులకు వివాహ విషయమున ధైర్యము నానాటికడుగంటెను. విషమ పరిస్థితులకు లోనగుదుమేమోయను తలపు వారి నందరిని బాధింపసాగెను.

సాంబమూర్తి మరణించినాడు. తల్లి, రాధల దుఃఖమునకు మేరయే లేదు. చేయవలసిన కార్యక్రమములు మామూలుగానే జరిగినవి. ఇరుగు పొరుగువారి ఓదార్పులతో పదిమాసములు గడచినవి.

రాధ ... పూర్ణయవ్వనవతి. ఇప్పుడామె విద్యాభ్యాసము మానివేసినది. కలిగిన విద్యతోనే తల్లికి తగు సహాయకారిగానుండినది.

క్రమంగా కొంత మనోధైర్యాన్ని చేకూర్చుకొంది. రాధకు ఐదారుమాసములలో వివాహము జరిగించవలెనను దృఢసంకల్పంతో పర్యటనకు బయలుదేరింది "వరుని" కొరకు ..

ఆ వూరిలో గొప్ప పండితుడు ఆలయ పీఠాధిపతి, ప్రస్తుతము లేకపోయినా ఇంకొక ఐదారు మాసములలో తండ్రి తాతలవలన

సంక్రమించినదగు పీఠాధిపత్యమును నిర్వహించును. ఇరువదినాల్గేండ్ల వయస్సులో నున్నాడు. ఏకాకి అని విని వెంబడే దేవి అచ్చటికి ప్రయాణంచేసింది. పండితుడు, పీఠాధిపతి కాబోవువాడు, యువకుడు నయిన మాధవునితోనే మాట్లాడినది. ముహూర్త నిశ్చయంకూడా జరిగింది. ...

రాధా మాధవుల వివాహం ఆలయంలోనే అతివైభవంగా జరిగింది. రాధను అప్పగింతలతో విడువలేక విడచి స్వగ్రామం చేరుకుంది. ఇప్పుడు రాధా మాధవులు అన్యోన్యానురాగులు ప్రేమికులు, పరస్పరప్రేమానుబద్ధులై కాలము గడపుచున్నారు.

మాధవుని తల్లిదండ్రులు బాల్యంలోనే మరణించిన కారణంచే ఆ దంపతులొక్కరే ఒకకుటీరంలో నివాసమేర్పరచుకొనిరి. ఒకశుభ ముహూర్తమున మాధవుడు ఆలయపీఠాధిపత్యమును స్వీకరించెను. రాధ భర్త సాన్నిధ్యంలో ఆ పరమేశ్వరుడు ప్రసాదించిన పవిత్రమహత్తరసందేశాన్ని పొందగల్గెను.

ప్రేమానురాగ పూరితమైన రాధ భర్తతోడిదే లోకమని కాలముపుచ్చుచు నిష్కల్మషమైన హృదయములో పతిసేవ చేయుచుండెను. ఈలా ఎన్నాళ్లో గడవలేదు.

ఒకసంవత్సరం కాలగర్భంలో కలసింది. రాధలో మార్పేమీ లేదు. కాని భర్తలోని చీకాకు చిరాకులను గమనించింది. తాత్కాలికపు విసువుదల అని సరిపుచ్చుకొనుచువచ్చినది ఈ నవ యువ భర్తల విషయమెరుగని రాధ. కాని ఈ చిరాకు నానాటికి వృద్ధికాజొచ్చెను. రాధను ఏవగించుకొని కోపగించి కొట్టుట ప్రారంభించెను. రాధ మాత్రము ''విసువుదలవలన'' యని సరిపుచ్చుకొన సాగెను.

ఆ వూరిలోని శివాలయం మాధవుని పితరులు నిర్మించినది. వారేదాని పీఠాధిపతులుగను, మతాధికారులుగను, ధర్మకర్తలుగనుండుచూవచ్చిరి. ఆ తండ్రి తాతల తదనంతరం సంక్రమించిన ధర్మకర్త పీఠాధిపతి పదవులను ప్రస్తుతము మాధవుడు నిర్వహించుచుండెను.

దేవాలయమునకు సంబంధించిన వస్తు పరిచారకబృందంలో దేవదాసియొక్కతె. ఈ దేవదాసిపొందవలసిన డబ్బు ధర్మకర్త వసూలు చేసిన దేవుని ఇనాములో పొందును. ఆ దేవాలయపు దేవదాసి ఈశ్వరి పదునెనిమిది సంవత్సరముల వయస్సు ... ... అనుదినము రెండు మార్లు దేవునియొద్ద నృత్యము సల్పిపోవుట నియమము.

కాలమునకు విలువ ఎక్కడిది! రాధా మాధవుల వివాహంజరిగి సంవత్సరందాటి నది. మాధవుని యందలి మార్పు నా నాటికి వృద్ధియై విషమించినది. ఇప్పటింటి లోనొకనిముసమైన నుండడు. ఆలయ మందే రాత్రింబవళ్లు కాలము పుచ్చు చుండెను. అతనిలో ఇప్పుడు రాధకు తావు కనుపించదు. అంతట దేవదాసి ఈశ్వరి ప్రతిబింబిస్తున్నది.

ఆలయంలో మునుపటి వేదఘోష లేదు. పూజలు లేవు ... కాంతివంతంగా వుండే ఆలయ్యం కళావిహీనమయినది.

ఈశ్వరీ వీణానాదంతో ధర్మకర్త సరస సల్లాపాలతోనిండిపోయింది. శిలారూపంలో ఉన్న ఈశ్వరుడు ఈ అన్యాయానికి చలించలేదు...... విగ్రహపార్వతి కండ్లు తెరిచియుండికూడా లాభంలేదు ... రాధ ఇంటిలో ఏకాకి. ఐదారువారములుగడచి నవి. .... భర్త ఇల్లు చేరలేదు. ఇంకను ఆమె సత్యాన్వేషణతోనే జీవితంగడపదల చింది. భర్తనేమియు ఆక్షేపింపలేదు. భర్తయందలి ప్రేమ ఏమాత్రము తరుగ లేదు కాని ... భర్తనడవడిని గుర్తించి కృశించిపోవసాగింది.

రాధ తల్లి మరణించింది. రాధ రెండ కన్నీరుఫలురాల్చి మాతృప్రేమ వెళ్ల బోసింది.

ఈశ్వరీ మాధవులు వివాహమాడుటకు నిశ్చయించుకున్నారనే వార్త పూరంతయు మారు మ్రోగింది. పూరి పెద్దలందరు తగు విధమున బుద్ధులుగరిపారు. ఏంలాభం...

రాధ ... కుళ్లికృశించి పోయింది. రాత్రింబవళ్లు ఏకదీక్షగా ఆలోచిస్తున్నది. కర్తవ్యం? ఏమిటో తల్లిదండ్రులు వారి బాధ్యత తీర్చుకొని పరలోకగతులైరి. పరి పూర్ణవిశ్వాసంతో ప్రేమించిన భర్త సత్కారం ... ఆమెను మరింతకలవరపెట్ట సాగినవి. ఈశ్వరీమాధవులు ఎచ్చటికో వెళ్లిపోయినారను వార్త తెల్లవారుసరికి గ్రామమంతయుప్రాకినది. రాధకు మనో వైకల్యం కలిగింది. కారుచీకటులావె నావహించినట్లుంది ..

బిరబిర ఆలయ ప్రాంగణానికి పరు వెత్తింది. లోపలికి వెళ్ళిచూచింది. పార్వతీ పరమేశ్వరులు - ఆ పురాణదంపతులు .. శిలారూపంలో నిశ్చలులై యున్నారు .... బయటకు వచ్చింది పిచ్చిగా కేకలు వేస్తూ.

ఎదురుగానున్న జన సమూహంలోకి పరుగెత్తింది. వారిమెనుగమనించలేదు.... ధర్మకర్త పదవికొరకు పోరాడుకుంటు న్నారు ... ఈ ప్రపంచంలో ఎవరిజిజ్ఞాస వారిది. రాధ సమూహాన్ని, ఒక సారి దీక్షగాపరిశీలించింది ... అరచుకొంటూ పరువుతీసింది పూరిబయటకు ... ...

ఇప్పటికి ఇరువది సంవత్సరములు గడచినవి "నాయనా ఇదీ ఆమెవిషాదచరిత్ర ఈ రాధయే ఆ రాధ" నిట్టూరుస్తాడు గురువు. "తొలికోడి కూయుచున్నది మనము కుటీరము చేరుదము" అంటూ లేచాడు గురువు.

కన్నీళ్లు పైగుడ్డతో తుడుచుకుంటూ లేచాడు బాలుడు. ఆ యిసుకబాటల్లో నడకసాగించారు. దూరాన్నుండి ఒక శ్లోకం...

హేగోపాలక హేకృపాజలనిధే హేసింధుకన్యాపతే......

ఆ నూతనకంఠం వీరిని సమీపిస్తుంటుంది.

"బాబా ఈశ్వరీ మాధవులేమైనారు" ప్రశ్నిస్తాడు బాలుడు

"ఈశ్వరి మాధవుని వివాహమాడుదునని మోసగించి మరొకనితో ఎచ్చటికో వెళ్ళిపోయింది. మాధవుడు పశ్చాత్తాప హృదయుడై ఇల్లు చేరుతాడు. కాని ఏముందీ ... కుటీరం పాడుపడి కూలిపోయింది ... ప్రేమహృదయ రాధ కనుపించలేదు .... వెళ్లిపోయింది ఎచ్చటికో... ఈ దృశ్యం అతనిని మరింతకలవరపెట్టింది ... మాధవుడిప్పుడొకయోగి" ... అవ్యక్తి వీరిని సమీపించాడు. "అతడే మాధవుడు" అన్నాడు గురువు. అతడు వారినిదాటి పోయినాడు.

వేగుచుక్క పొడిచింది. కాలవైపరీత్యానికి కలవరపడుచు ఆ ఇసుకబాటల్లో మసకచీకటిలో ఆ గురుశిష్యులిరువురు అదృశ్యమయ్యారు...




# రంగడు — రాకుమారి

శ్రీమతి కొండూరి రామసీతమ్మ

—:o:—

(గత సంచిక తరువాయి)

గబగబా తన సంచీనిండా వాటిని నింపుకుని పెట్టె మూసి కుక్కను యథాస్థానంలోవుంచి జేబుగుడ్డను తీసుకుని బయటికివచ్చి తలుపుతాళంవేసి రెండవ గదికి వెళ్ళాడు.

ఆ గది మధ్యనున్న పెట్టెమీదకూడా ఒక కుక్క పడుకునివుంది. అది మరీ భయంకరంగా దబ్బకాయలంత కళ్లు పెట్టుకునివుంది. అదిగూడా రంగడిని చూచేసరికి పెద్ద అరుపు అరిచింది. రంగడు ధైర్యంగా జేబుగుడ్డనుపరచి కుక్కను తీసుకొచ్చి దానిమీద పడుకోబెట్టి నెమ్మదిగా పెట్టె తెరిచిచూశాడు. రంగడికి మరీ ఆశ్చర్యంవేసింది. దానినిండా వెండి నాణేలు మెరుస్తున్నాయి. గబగబా తన సంచీలోని రాగి నాణేలను అక్కడే పారబోసి ఆ సంచీనిండా వెండి నాణేలను నింపుకుని పెట్టెమూసి కుక్కను యథాస్థానంలో పెట్టి తలుపుమూసి మూడవ గదికి వెళ్ళాడు.

మూడవగది తాళంతీసి లోనికి వెళ్ళేసరికి ముందు చూచిన కుక్కలకంటే పెద్ద కుక్క తాటికాయలంత కళ్లతో అమితభయంకరంగా కనిపించింది. రంగడిని చూడంగానే అమితభయంకరంగా ఒక్క అరుపు అరిచింది. రంగడికి కాళ్లు వణకిపోయినయి. అతి భయంతో జేబుగుడ్డను క్రిందపరిచి ఆ కుక్కను తీసుకొచ్చి దానిమీద పడుకోబెట్టాడు. పెట్టె తెరిచి చూచాడు. దానినిండా బంగారు నాణేలు వున్నాయి. రంగడు మరీ ఆశ్చర్యపడ్డాడు. తన మూటలోనున్న వెండి నాణేలను అక్కడ పారబోసి వాటికి బదులు బంగారు నాణేలు బాగా కుక్కికుక్కి నింపాడు. తన లాగూ చొక్కా జేబులనిండా పోసుకున్నాడు. తరువాత పెట్టెమూసి కుక్కను యథాస్థానంలో పెట్టి తలుపుమూసి బయటికివచ్చాడు. భుజాన మూట చాలా బరువుగావుంది. అతికష్టంమీద మెట్లుఎక్కి చెట్టుబోదె మొదటికి చేరుకుని "ఓ ముసలమ్మా-పైకి లాగు" అని ఒక్క పొలికేక పెట్టాడు.

"ఓ. లాగుతా. పెట్టెను జాగ్రత్తగా పెట్టుకున్నావా?" అని అరిచింది ఆ ముసలమ్మ బయటనుంచి. "లేదు. మరిచిపోయ్యా. కొంచెంవుండు. ఒక్క క్షణంలో తీసుకొస్తా" అని కేకపెట్టి మరల హాలులోనికి వచ్చిచూచాడు. అక్కడ ఒక చిన్న బల్లమీద ఆ పాత రేకుపెట్టెవుంది. దానిని తీసుకుని మరల మెట్లెక్కి పైకిపోయ్యి ఆ ముసలమ్మను పిలిచాడు. ఆమె అసలే ముసలిది. రంగడో కుర్రాడు. పైగా మూటనిండా బంగారం. తగని బరువైంది.

అతికష్టంమీద ఆ అవ్వ రంగడిని బయటికిలాగింది. రంగడు నెమ్మదిగా తొర్రలోంచి బయటికివచ్చి చెట్టు దిగాడు.

రంగడు చెట్టుదిగి రోడ్డుమీదకు రాగానే ఆ ముసలిది ఎదురేగి "ఏం నాయనా క్షేమంగా వచ్చావా. నీకు కావాల్సినంతధనం తెచ్చుకున్నావా. డబ్బా తెచ్చావా" అని ప్రశ్నల వర్షం కురిపించింది. ఆమె ఆత్రం చూచేసరికి రంగడికి కొందుకో అనుమానం కలిగింది. "ఆ డబ్బా తీసుకొచ్చా. నాకు కావాల్సినంత ధనం నేను మోయగలిగినంత తెచ్చుకున్నా. అది సరేగానీ అవ్వా ఆ పాత డబ్బా గురించి అంత పరీక్షగా అడుగుతున్నావెందుకూ ?" అని అడిగాడు రంగడు డబ్బాను జేబులోనుంచి బయటికితీస్తూ.

"ఏయ్. నీకు అదంతా అనవసరం. నీకు కావాల్సింది ధనం. అది నీకు కావాల్సినంత తెచ్చుకున్నావు. అంతే నీ పని డబ్బా యిలాయిచ్చేయి."

ఆమె మాటలకు రంగడికి కోపంవచ్చింది. వెంటనే చెట్టులోంచి కత్తిని బయటికితీసి పైకిఎత్తి "చెప్పు. ఆ డబ్బాను గురించి ఎందుకు అంత ఆసక్తిచూపుతున్నావో. లేకుంటే ఒక్క దెబ్బకు నీ తల నరుకుతా" అన్నాడు కోపంగా.

"నేను చచ్చినా చెప్పను. మర్యాదగా నా డబ్బా నాకిచ్చేయి" అంది మూర్ఖంగా.

"ఆ - ముసలిముండకు అంతపట్టా! యిస్తావుండు" అని చెప్పి రంగడు తన కత్తితో ఆ ముసలిదాన్ని ఒక్కదెబ్బ కొట్టాడు. ఆ దెబ్బకు ముసలిది పరలోకంచేరింది. రంగడికి భయంవేసింది. ఎవరన్నా చూస్తే తంతారేమోనని భయపడ్డాడు. ఆ ముసలిదాని శవాన్ని అక్కడే వదలి మూటను నెత్తినిపెట్టుకుని గబగబా రోడ్డున నడుస్తూ కొంతసేపటికి ఒక చిన్నపట్టణంచేరాడు.

పట్టణం చిన్నదైనా వసతులకు ఏమితక్కువలేదు అక్కడ. అనేక హోటళ్లువున్నాయి. పాశ్చాత్య నాగరికతానిలయమనదగిన ఒక ఇంగ్లీషు హోటలులో ఒక పెద్ద గదిని అద్దెకు తీసుకున్నాడు రంగడు. ఆ హోటలులో విందులు నాట్యాలు, జూదాలు మొదలయినవన్నీ వున్నాయి. రంగడు మంచి మాంసంతో భోంచేసి కొంచెం సారా త్రాగి విశ్రాంతిగా పడుకున్నాడు. ఇక రంగడికి ఏలోటూలేదు. కావాల్సినంత బంగారం వుందాయె. యిష్టమొచ్చినట్లు విలాసమయిన జీవితాన్ని గడపవచ్చు. మరుసటిరోజు తన పాత మిలిటరీ గుడ్డలన్నింటినీ పారేసి కొత్త కొత్త సిల్కు గుడ్డలు కుట్టించుకున్నాడు. మిలిటరీ బండ బూట్లకుబదులు నాజూకైన అధునాతనమైన చక్కటి బూట్లను హెచ్చువెలయిచ్చికొన్నాడు. స్నేహితులు కూడా అనేకమంది పోగయ్యారు. డబ్బుండంగా మిత్రులకేంకొదవ! వారి పుణ్యమాయని రంగడు డాన్సులు, జూదాలు మొదలయిన దురలవాట్లకు అలవాటుపడ్డాడు. ఒక మిత్రుడు ఆ పట్టణపు రాకుమార్తె సంగతి చెప్పాడు. ఆ రాకుమారి చాలా అందమయినదట. ఆమె సంగతి వినేసరికి రంగడికి ఎలాగయినా ఆమెను చూడాలని బుద్ధిపుట్టి ఒక మిత్రుడితో తన కోరికను చెప్పాడు.

"అసంభవం," ఆ మిత్రుడు వెంటనే నిష్కర్షగా చెప్పేశాడు. "నీవు ఆమెను చూడలేవు. ఆమె నీకు అందనిపండు. ఆమెకు ఒక పెద్దకోట విడిగా కట్టించి అందులో ఆమె నివాసం ఏర్పాటుచేశాడు ఆమె తండ్రి. ఆ కోటగోడచుట్టూ ఎవరూ ఎక్కలేనంత ఎత్తున అనేక ప్రాకారాలను కట్టించాడు. ఆ ప్రాకారాలకు బయట పెద్ద కాలువ ఆ గోడలను అనుకుని ప్రవహిస్తుంటుంది. అందువలననే ఆమెను చూడాలంటే ఎవరికీ సాధ్యపడదు. రోజూ ఆమె తండ్రీ అంటే మహారాజా, రాణీ మాత్రంపోయి చూచి వస్తుంటారు. ఆ రాకుమారి ఒక సామాన్య సైనికుని వివాహమాడునని ఎవరో ఆ రాజుకు పూర్వం జోస్యం చెప్పారుట. అది ఇష్టంలేక ఆ రాజు ఆమెను అలా విడిగా దాదాపు ఖైదీలాగా బంధించాడు."

(సశేషము)

# అల్పబుద్ధివాని కధికారమిచ్చిన

 శ్రీ బొడ్డుపల్లి కృష్ణావధాని 



ఒకమంగలి తమరాజు కులాసాగానున్నప్పుడు చూచి "మహాప్రభూ! నాకు మంత్రి పదవి నిర్వహించవలెననియున్నది. తాము తలచుకుంటే" అని రాజును స్తోత్రంచేశాడు. రాజు సయితం అమాయకుడగుటచే తన మంత్రినిపిలచి "మంత్రీ! మనదర్బారు మంగలికి మంత్రిపదవి నిర్వహించాలని యున్నదట. కొంతకాలం నీవు తప్పుకొని అతను మంత్రిగానుండనీయ" మన్నాడు. "మంత్రి చిత్తం" అని తప్పుకొన్నాడు.

కాచుకొని కూర్చొనియున్న శత్రువులు ఆ మరునాడే ఆరాజ్యంపై దండెత్తి వచ్చారు. ఆ రాజు మంగలిమంత్రినిపిలచి "మంత్రీ! శత్రురాజులు మనదేశంపై దండెత్తివస్తున్నారు. తక్షణం వారి నెదుర్కోడానికి యుద్ధసన్నాహాలు చేయించండి" అన్నాడు.

యుద్ధమంటే తెలియని మంగలిమంత్రి "రాజా! మనకీ యుద్ధాలెందుకు! బ్రతికియుంటే బలుసాకుతిని బ్రతుకవచ్చు. మనకు కావలసినసైన్యము లేదుకాబట్టి పారిపోదాం పదండి" అని సలహా యిచ్చాడు.

"పారిపోయి ఏమి చేద్దామని నీ యుద్దేశం?"

"అదేమిటిరాజా! నా దగ్గర రెండు మంగలిపొదులున్నవి. చెరొకటి భుజాన తగిలించుకొని బ్రతుకుదాం" అన్నాడు మంగలిమంత్రి.

"ఛీ! నీ సలహామండ!" అని అతనిని గెంటేసి మునుపటిమంత్రిని పిలచి ఉద్యోగమిచ్చాడు.

బుద్ధికుశలుడైన ఆ మంత్రి దేశంవెలుపల బ్రహ్మాండమైన డేరాలు వేయించి వాటికి మైలుదూరంలో కొన్నివేల అరటి ఆకులను పెరుగన్నంమెతుకులతో పారేయించాడు. నిజానికి తమసైనిక బలం కొద్దిపాటిదైనా ఆ డేరాలు, ఆకులు చూచి బ్రహ్మాండమైన సైనిక బలమున్నదని భ్రమపడి శత్రురాజులసైన్యాలు పలాయనం చిత్తగించినవి.

చూశారా బాలల్లూ! అల్పబుద్ధివానికధికారమిస్తే చేయుకలిగిందేమిటో!

—o—

# కుటుంబ పరిశ్రమలు

శ్రీ దోర్బల శేషాద్రిశాస్త్రి



ఆంగ్లేయుల పరిపాలనకు పూర్వము మన దేశములో కుటుంబ పరిశ్రమలు గ్రామీణుల జీవనసాధనములలో ముఖ్యస్థానము వహించి, తీరికసమయములలో కుటీరపరిశ్రమలవల్ల వ్యవసాయకులకు కొంత ఆదాయము వచ్చుచుండెడిది. యీ పరిశ్రమలలో రెండుకోట్ల ప్రజలు అనాదినుంచి పాల్గొనుచుండిరి.

యీ పరిశ్రమలన్నిటిలో నూలు వడకుట, చేనేత, ముఖ్యస్థానము వహించినవి. చేనేతపరిశ్రమలో సుమారు ఏభైలక్షల ప్రజలు పాటుపడుచున్నారు. యీ పరిశ్రమలతో పాటు, కలంకారీ అద్దకం ప్రముఖస్థానం వహించి వుండెను. వున్ని కంబళ్లు, తివాచీల నేత మన దేశంలో విరివిగా జరుగుచుండెను. ఇత్తడి సామాన్ల పోత, కంచుపోత యీ పరిశ్రమలు మన దేశమూలో కంచర్లు, కాపులు జరిగించుచుండిరి. ముఖ్యముగా ఆర్య క్షత్రియులు ఆటవస్తువుల పరిశ్రమలో పాల్గొని కొండపల్లిలోనూ, పుదుచేరిలోనూ అందమైన ఆటవస్తువులను చేయుచుండిరి. జరీ జల్దారు నేత యీ పరిశ్రమకూడా గ్రామములలో బహు వ్యాప్తియందుండెను. నవ్వారునేత కాపు స్త్రీలు యెక్కువగా పరిశ్రమ చేయుచుండెడివారు. గాజులు, వైక్రాంతంరాళ్లు యీ పరిశ్రమలుగూడ కొద్దో గొప్పో సాగుచుండెడిది. నువ్వులతో పప్పునూనె, మంచినూనె నాటికి నేటికి తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలలో విరివిగా సాగుచునే యున్నది. తాటిబెల్లం పరిశ్రమను కులాలీలు అనాదినుంచి ఫిబ్రవరినెల లగాయతు జూన్ ఆఖరువరకు సాగించుచునే యున్నారు. ముగ్గురు కుటుంబమ్ముకలవారు అరవై తాడిచెట్లనుంచి నాలుగైదునెలల్లో ఆరు లేక ఏడుపుట్లబెల్లం తయారుచేయుదురు. తాటినారతీసి దానితో తాళ్లు, మోకులు, తట్టలు, బుట్టలు, విసనకర్రలుచేయు పరిశ్రమ అనాదినుంచి సాగుచునే యున్నది. కొబ్బరినారతీసి దానితో కొబ్బరిత్రాడు, బుట్టలు, తట్టలుచేయుట, యీ పరిశ్రమకూడ గ్రామములలో చాలా కాలమునుంచి సాగుచునే యున్నది. యీ పరిశ్రమ తిరువాన్కూరు, కొచ్చిన్ల రాష్ట్రములలో పెద్ద స్థాయిలో జరుగుచున్నది. కాని ఆంధ్ర రాష్ట్రములో నర్సాపురం తాలూకా సంబల్‌దీవి ప్రాంతములో మాత్రము ఇది నిలచియున్నది. యీ పరిశ్రమను బహు వ్యాప్తి చేయవలసిన అవుసరం ఎంతైన వున్నది.

యీ కుటుంబ పరిశ్రమలన్నియూ పదిహేడవ శతాబ్దమునుంచి చాల హీనస్థితిలోనికి వచ్చినవి. వీటికి ప్రభుత్వ ఆదరణ లేకపోగా, తమ పరిశ్రమలను మన దేశములో విరివిగా ఖర్చుచేయుటకుగాను ఆంగ్లేయులు మన కుటీర పరిశ్రమలకు ధనసహాయము చేయనందున యీ కుటీరపరిశ్రమలు పూర్తిగా కుంటుపడినవి. యీ పరిశ్రమలలో పాల్గొను గ్రామీణులు బీదస్థితిలో వుండుటవల్ల వీరికి పెట్టుబడి వడ్డీ సహకారం సంస్థలుగాని, గవర్నమెంటు సంస్థలుగాని లేక ముడి సరుకులు ఒక్కసారిగానూ, చౌకధరలలోనూ కొనుక్కొనుటకు వీరలవద్ద ద్రవ్యము లేకపోవుటవల్లనూ, నూతన యంత్ర సహాయము లేకుండా యుండుటవల్లనూ, తయారయ్యే వస్తువులకు మంచి ధరలు రాబట్టిపెట్టుటకు మార్కెటింగు సహకారములులేక, మేలురకం వస్తువులు తయారుచేయుటకు వారికి తెలియజెప్పే సంస్థలులేక, మన దేశములో కుటుంబ పరిశ్రమలు బహు తక్కువదశలోనికి వచ్చెను. ౧౯౪౭ వ సంవత్సరంలో మన దేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత, మన ప్రభుత్వమువారు కుటుంబపరిశ్రమల ప్రాముఖ్యత బాగా గ్రహించి

౧౯౫౩వ సంవత్సరంనుంచి యీ పరిశ్రమల అభివృద్ధికిగాను ఖాదీ గ్రామపరిశ్రమలబోర్డు, చేనేత పరిశ్రమలబోర్డు, శిల్పములబోర్డు (Handicrafts Board) నారనేతబోర్డు (Coir Board), యీ వివిధ బోర్డులను స్థాపించుటయేగాక, ౧౯౫౫ ఫిబ్రవరినెలలో జాతీయ లఘు పరిశ్రమల కార్పొరేషన్ నెలకొల్పి కుటీరపరిశ్రమల అభివృద్ధికి హెచ్చుగా సొమ్ము కేటాయింపుచేసి, మన శిల్పములను హిందూదేశములోని అన్ని రాష్ట్రములలోనూ ఇంకా యితర దేశములలోనూ అమ్మకంచేయుటకు ఏర్పాటుచేస్తూ, కుటీర పరిశ్రమల అభివృద్ధికి శ్రద్ధాభక్తులతో ప్రశంసనీయముగా మన ప్రభుత్వము కృషి సలుపుచున్నది.

అయితే సత్వరముగా కుటీరపరిశ్రమలు అభివృద్ధి అగుటకు యీ కృషి చాలదు. మనము యీ విషయములో జపానులో జరిపే పద్ధతులను పూర్తిగా అవగాహనచేసుకొని వీలైనంతవరకు వాటిని మనము అవలంబించవలసి యున్నది. జపాను దేశములో సహకార సంఘములద్వారా కుటుంబపరిశ్రమలు దినదినాభివృద్ధిగాంచుచూ ఉన్నతస్థాయిని అలంకరించినవి. యీ సహకార సంఘములు, ఉత్పత్తిలో మంచిరకపు (Standardised) సరుకు తయారగుటకు ప్రయత్నించుచూ, నూతన పద్ధతులను అవలంభించుచున్నవి. ముడి సరుకులు యీ సహకార సంఘములు చౌకగా కొనుగోలుచేసి పరిశ్రమలలో పాల్గొనువారికి అందజేసి వారు తయారుచేసిన సరుకును మంచి ధరకు యీ సహకార సంఘములు అమ్మకంచేయుచున్నవి. యీ సహకార సంఘములకు చేదోడుగా జపానులో రెండువందల తొంభైరెండు పరిశోధన కేంద్రములు ప్రభుత్వమువారు ఏర్పాటుచేసి, ఎప్పటికప్పుడు యీ పరిశోధనాలయములు నూతన పద్ధతులను కనిపెట్టి గ్రామములలో వీటిని వ్యాప్తిచేయుచున్నారు. జపానులో వ్యాపార బ్యాంకులు (Commercial Banks) కుటుంబ పరిశ్రమలకు సహకార సంఘములద్వారా అప్పులుయిచ్చి పది సంవత్సరములలో పదివాయిదాలద్వారా యీ సొమ్మును వడ్డీతోసహా తిరిగి వసూలుచేసుకొనుచున్నారు.

యివిగాక జపానులో కొద్ది వ్యాపారముల ఏజన్సీలను (Small Enterprise Agencies) ప్రభుత్వము వారు విరివిగా నెలకొల్పినారు. యీ ఏజెన్సీల ద్వారా కుటుంబపరిశ్రమల వస్తువులను, ప్రదర్శించుటకు ప్రదర్శనములు ఏర్పాటుచేసినన్నీ, సరుకులకు మంచి ధరలు రాబట్టినన్నీ, తక్కువ వడ్డీలకు అప్పులు ఏర్పాటుచేయడము మూలముగా కుటుంబపరిశ్రమలను ప్రశంసనీయముగా అభివృద్ధిచేయుచున్నారు. మన ప్రభుత్వమువారు జపానులో కుటుంబపరిశ్రమల అభివృద్ధికి జరుపుచున్న విధానములను జాగ్రత్తగా పరిశీలనచేసి, మన దేశములోగూడ పరిశోధనా కేంద్రములను ఏర్పాటుచేసి వ్యాపార బ్యాంకులను కొద్ది వ్యాపార ఏజెన్సీలను నెలకొల్పి కుటుంబపరిశ్రమలను అభివృద్ధిచేసినచో గ్రామీణులలో జాతీయ ఆదాయము పెరిగి, కర్షకులకు తీరిక సమయములలో జీవన సాధనములు ఏర్పడి, దేశ అభ్యుదయమునకు కుటుంబ పరిశ్రమలు పూర్తిగా తోడ్పడగలవు.

(ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంవారి సౌజన్యంతో.)

P. I. B.



# ఆత్మ పరమాత్మల ఐక్యతా చిహ్నము ప్రార్థన

మూలం :
స్వామి కేశవయ్యాజీ

అనుసరణ :
శ్రీ సి. సి. పున్నయ్య



కలియుగములో గొప్ప బోధకులందరు సంసారబంధములనుండి విముక్తిచెందుటకు సజ్జన, సాధు సాంగత్యమును, దైవ ప్రార్థనను ఆచరణలోనుంచిరి. దివ్యపురుషుల సాంగత్యము భగవత్సాక్షాత్కారము పట్ల ఆసక్తిని పెంపుజేయును. ఇట్టి ఆసక్తి లేనిదే ఆధ్యాత్మిక ప్రపంచములో మానవుడు సాధించకలుగునది ఏమియు లేదు. దీనిని సాధనయందుంచుటకు దైవప్రార్థన మార్గదర్శకము.

దైవ ప్రార్థన ఆత్మ పరమాత్మల ఐక్యతా చిహ్నము. అది శాశ్వతమైనట్టి, పవిత్రమైనట్టి విషయములపట్ల ఆసక్తి. ఉన్నతమగు పరిశుద్ధతకొరకు పాటుపడు మానవుడు తన బలహీనతను గుర్తించి పశ్చాత్తాపముతో పరమాత్మ ఎదుట క్షమాపణ కోరుటకు వినియోగపడునది ప్రార్థన. అదే సమయాన మానవుడు భగవంతుని చేతులలో సాధనమై, మానవుడుచేయు ప్రతి పనికి భగవంతుడే కారకుడైనా, తన నిస్సహాయతను తెలియజేయునది. మానవ జీవయాత్రలో మానవుడు రథమయి, భగవంతుడు చోదకుడుగా నున్నాడు. రథచోదకుడు రథమునే మార్గమున నెచటికి నడిపిన నచటికి పోగలదు. కాని సాధారణముగా ప్రార్థన మానవుని దృష్టిలో వర్తక వ్యాపార సరళిగా దిగజారి తన ప్రాపంచిక అవకాశముల నుద్దేశించి - తమ్ము సంపన్నులుగా చేయునట్లుగాను, తమకు అధిక లాభాల నీయవలసినదిగాను, ఉద్యోగ ప్రమోషనుల నీయవలసినదిగాను ప్రాధేయపడుటకు వినియోగపడుతున్నది. అట్టిది ప్రార్థన అనిపించుకోదు సరిగదా మానవుని అజ్ఞాన పూరిత స్వార్థమగును.

## భగవంతునిపట్ల విశ్వాసము

నిజమైన ప్రార్థన ఎల్లప్పుడు భగవంతుని ఉనికిని రూపం ఏదైనా, రూపరహితంగానో రూఢీపరచుచుండును. విశ్వాసము ఆధ్యాత్మిక జీవితమునకు పునాది వంటిది. ప్రతి క్షణం అనుమాన అవిశ్వాసములతో భక్తుడు సాధించకలుగునది శూన్యమే కాగలదు. విశ్వాసము మనల ననేక కష్టములనుండి తప్పించగలదు. మన తోడి మానవులకు సేవజేయుట విశ్వాసమును మనలో యినుమడింపజేయును. సేవాపరాయణుల హృదయములను భగవంతుడుతన స్థావరముగా చేసికొనును. ప్రార్థనాపూరితహృదయము ఆత్మకు, మానవసేవకు వాహనమై సదాభగవధ్యానమునందుండునదిగానుండును.

మానవుడు తన శరీరమును, బుద్ధిని, హృదయమును, ఆత్మను పరమాత్మకు పూర్తిగా నివేదించుటయే ప్రార్థన. పెదవుల కదలికచే జరుగువల్లింపు హృదయము, బుద్ధి, ఆత్మ భగవంతునిపై కేంద్రీకృతము కానిచోనది ప్రార్థన కానేరదు; అది నటనమాత్రమే. భగవత్ప్రార్థన మానవుని పరిశుద్ధపరచి, అతనిలోని దురాశ వ్యామోహము, కోపములాంటి దుర్గుణములనరికట్టును; అతనిలో పరస్పర సహనమును, సద్భావమును పెంపుజేయును. కొన్నిసందర్భములలో మానవుడు అనుమానములకు, నిస్పృహకు, గాఢాంధకారమునకు గురియైనను, వానిని అపరిమితమైన ఓర్పు, ధైర్యములతో ఎదుర్కొనుటకు అలవాటుపడవలెను. భగవత్ప్రార్థన కలవాటుపడినవానికి తిరోగమనముగాని అపజయముగాని యుండదు.

## ఆత్మ పరమాత్మల ఐక్యత

నమ్రతతో భక్తి పూర్వకంగా భగవంతుని వేడికోలు ప్రార్థన. అది హృదయము దానినిర్మాతయగు పరమాత్మతో ఐక్యమగుటకు సాధనభూతము. ప్రార్థన ప్రధానమైన మానసిక చర్యయేగాని మాటలతో ప్రమేయములేదు. వివిధ సాధనలు మనలనుత్తములుగా, నమ్రతగలవారుగాచేసి, భగవదేచ్ఛలేనిదే ఏది జరుగదనియు, భగవంతుడు కుమ్మరియై మనము అతనిచేతులలో బంకమట్టిలాంటివారమని తెలియజేయును. ప్రార్థనాకాల పరిమితి వ్యక్తిగతముగా వారివారి ఆధ్యాత్మిక స్థాయిననుసరించి మారుచుండును. ప్రార్థన వారివారి మాతృభాషలోనుండుట మంచిది. మౌనప్రార్థన సాధారణముగా పైకి వల్లింపుకంటె ఫలప్రదమైనది. పవిత్ర హృదయముయొక్క ప్రార్థనకు జవాబు తప్పక లభించును.

అనుదినజీవయాత్రను ప్రార్థనతో ప్రారంభించుట ఉత్తమమార్గము. అందువలన భగవత్కటాక్షము ఆరోజంతయు తనదినచర్యలో లభించగలదు. అలాగే రాత్రిపరుండబోవునప్పుడు భగవత్ప్రార్థన చేయుటవలన చెడుకలలతో నిద్రాభంగముగలుగక ప్రశాంతముగా గడచిపోగలదు. ప్రార్థనా స్వరూపము నిష్కపటంగానుండి భగవంతునితో ఏకపరచునదిగానుండవలెను. హృదయంయొక్క సహజమైన నినాదము ప్రార్థనయొక్క ఉత్తమ స్వరూపము. రూపంఏదైనా బుద్ధి, హృదయము, పలికే పలుకులు ఏకోన్ముఖంగా భగవంతునిపై కేంద్రీకరించబడవలెను.

మరింత సయుక్తికమైన వివరణ ఆధునిక నాగరకతావికృత రూపము. మనము పసిపాపకుమల్లె అమాయకత్వముతో 'నాయునికి యదార్థమైనచో పరమాత్మయునికి అట్టిదే' అనే పరమాత్మపట్ల విశ్వాసముతో పురోగమించవలెను. భగవంతుని పట్లమనకెప్పుడు విశ్వాసముకుదిరినదో అప్పుడు ప్రార్థన ఆవశ్యకత దానినంటియేయుండును.

# స్వయంకృషి

శ్రీ గాడేపల్లి శంకరం

స్వశక్తిమీద ఆధారపడి స్వంతముగా పనిచేసుకోవడమే స్వయంకృషి — ఈ నాటి గ్రామాలలో స్వయంకృషి తక్కువగావుంది. ఎందుచేత? గ్రామస్థులకు ఎన్నో విషయాలు చెబుతున్నాము. ఇల్లును శుభ్రముగా వుంచుకోమన్నాము. పల్లెను బాగు చేసుకోమన్నాము. పొలంలో అధికముగా పండించుకోమన్నాము — హృదయ విదారకమైన పరిస్థితులనుండి తప్పుకునే మార్గాలు అనేకంగా చెబుతున్నాము. అనవసరపు ఖర్చులు మానమనీ — అధికాదాయాన్నిచ్చే మార్గాలు అనుసరించమనీ — జీవన పరిమాణాన్ని వృద్ధిచేసుకోనమనీ — దరిద్రకారణమైన బద్ధకాన్ని వదలిపెట్టి శ్రద్ధగా కృషిచేయమనీ ప్రబోధిస్తున్నాము. చెవిని ఇల్లుకట్టుకొని ఘోషిస్తున్నాము — మన మాటలు అతనిచెవిని పడుతున్నాయా? పడుతున్నాయి. కాని అతడు పెడచెవిని పెడుతున్నాడు. మనలను మన మార్గాలనూ అలక్ష్యంచేస్తున్నాడు — ఎందుచేత? అతనికి బాగుపడాలనిలేదా? — ఉంది అయితే ఈ నిరాశ, నిస్పృహా అతనిలో కలుగటానికి కారణంఏమిటి? కారణంవుంది — వడ్డీకి వడ్డీలుకట్టి అతని నడ్డిని విరుగకొట్టే — ఋణదాతల బారినుండి అతనిని తప్పించలేకపోవటమే దీనికి కారణం — ఋణదాతతో లాలూచీపడి అప్పులుమీద అప్పులుచేస్తూనే వున్నాడు? ఎందుచేత — ఇతరత్రా అప్పుదొరికే మార్గంలేకపోవటంచేత — అనవసరపు ఖర్చులు మానలేకపోవడంచేత — పండిన సరుకుకి ధరగిట్టుబాటు కాకపోవడంచేత ఎండినా పండినా తను దరిద్రాన్నే అనుభవిస్తూవుండటంచేత — అతనిలో, నిరాశ — నిస్పృహా ఏర్పడినాయి — అప్పునుంచీ బయటపడే ఉపాయాయమే అతడు ఆలోచించటంలేదు — పొలంమీద పుట్టికి రెండు పుట్లు పండించే మార్గాలేవీ అతడు అన్వేషించటంలేదు — అనుసరించటంలేదు — అతడు తనకాలి ముందరఉన్నా డబ్బునుకూడా గుర్తించటంలేదు — ఉన్నంతకాలం తినరా — తిన్నంతకాలం మనరా — రేపు మనదికాదురా అనే తత్వములో పడిపోయాడు — ఈ నైరాశ్యంనుంచి అతడిని మనం తప్పించాలి. ఈ వైరాగ్యభావం అతనిలో కలుగకుండా చెయ్యాలి. అతనిలో అప్పుడు ఆసక్తి కలుగుతుంది — స్వయంకృషికి సంసిద్ధపడుతాడు — స్వశక్తిమీద ఆధారపడి — సమస్తమైనపనులు చేసుకొంటాడు — అభివృద్ధిని పొందుతాడు.

అన్ని బాధలకంటె ఋణబాధ యెక్కువది — కటిక కసాయివాళ్లైన వడ్డీ వ్యాపారస్తులబారినుండి అతనిని తప్పించాలి — ప్రతి గ్రామంలోను — పరపతి సంఘాలు పెట్టించాలి — అతనికి అదునుకు అప్పులిప్పించాలి. అతడు శ్రమపడి పండించిన సరుకును — సహకార సంఘముద్వారా సరియైన ధరకు అమ్మించిపెట్టాలి — ఇంక అతడికి కావలసిందేముంది! అతడు పడినశ్రమకు తగిన ఫలితం చేతిలోపడినప్పుడు — అతడికి ఎన్నో ఆలోచనలు కలుగుతాయి — మనం చెప్పిన మార్గాలు స్ఫురణకు వస్తాయి. కొత్త కొత్త పంథాలు తొక్కిచూస్తాడు — బేంకులో డబ్బు దాచుకొని — పొదుపు నేర్చుకుంటాడు — సొమ్మును కూడబెట్టుతాడు —

బ్యాంకులోడబ్బు దాచుకోవడం నేర్చితే — అనవసరపు ఖర్చులు తగ్గిపోతాయి. ఎందుచేత? అన్నప్పుడల్లా డబ్బు చేతిలో కనబడదు కనుక — తనదైనా సొమ్ము బ్యాంకులో వుంటుంది — అత్యవసర పరిస్థితులొచ్చినప్పుడే — బాంకుకువెళ్ళి — కావలసిన డబ్బు తెచ్చుకుంటూ వుంటాడు. ప్రప్రథమంగా — పల్లె గ్రామాల్లో జరుగవలసినది — పరపతి సంఘాల ఏర్పాటు — సేవింగ్సు బాంకుల సౌకర్యాలు —

క్రయవిక్రయాదులు జరిపే సహకార సంస్థలు నిర్మాణము జరిగితీరాలి – ప్రతి గ్రామానికి ఒకటిగాని లేదా పదిగ్రామాల కొకటి చొప్పునగాని ఏర్పాటుచేసి తీరాలి – గవర్నమెంటువారు ఈ ఏర్పాటుచేసిన నాడు – గ్రామీణులలో బ్రతుకుమీద ఆసక్తికలుగుతుంది–బాగాబ్రతుకటానికి ప్రయత్నంచేసుకుంటారు–

గ్రామీణుని జీవనపరిమాణాన్ని గ్రామీణుడే వృద్ధిచేసుకోవలసినవాడై యున్నాడు. ఆ సంగతిని అతనికి తెలియచెయ్యాలి – సౌకర్యములు – సదుపాయములు ప్రభుత్వము కల్పించినా ప్రజలు – స్వయంకృషిమీద, స్వశక్తిమీద ఆధారపడవలసినదే.

ప్రభుత్వంవారు తనకు అండగానిలిచి – అభయమిస్తున్నారని అతనికి తెలిసిననాడు – అతనిలో ఆసక్తి పుట్టుకొస్తుంది. అతనికి ధైర్యంకలుగుతుంది. అప్పుడు మనంచెప్పే విధానాలమీద విశ్వాసము – చేసిచూపే మార్గాలమీద మమకారముకలుగుతుంది– స్వశక్తిమీద ఆధారపడి – స్వయంకృషి చేసుకుంటాడు –

అతనిలో నిస్పృహ నైరాశ్యము వృద్ధిచేసిన – దారుణపరిస్థితులనుండి అతనిని తప్పించటం – అతడు సంపాదించిన డబ్బును బాంకులో దాచుకొని వాడుకునే సదుపాయము కల్గించటం జరిగితే – అతడు మనం చెప్పినట్లు తప్పక వింటాడు –

ప్రభుత్వమువారు చేసే సదుపాయాలకు – సౌకర్యాలకు కొంత హద్దు వుంటుంది – హద్దుమీరిచేసినవి అనర్థదాయకంగాకూడా పరిణమించవచ్చు – ప్రభుత్వంవారే సమస్తము చేయవలెనంటే ప్రభుత్వానికి డబ్బుకావాలి – ఈ డబ్బు ప్రజలనుండేకదా – ప్రభుత్వం రాబట్టుతుంది! ఈ బాదరబందీ ప్రభుత్వానికి తగ్గించి స్వశక్తిమీద ప్రజలు ఆధారపడటం నేర్చుకుంటే – ప్రభుత్వానికి పని తక్కువవుతుంది, ఏగ్రామంలోని డబ్బు – ఆ గ్రామంలోనే ఖర్చుపెట్టి – అభివృద్ధికరములైన పనులు చేసుకోటానికి అవకాశంవుంటుంది–పనులు చురుకుగానూ జరుగుతాయి. ఆలశ్యమూ వుండదు.

అన్నప్పుడల్లా, సిస్తురేమిపన్ను యీయమని ప్రభుత్వాన్ని ఒత్తిడిచేయడంకూడా తగదు – ఇది చాలా పొరపాటు–ప్రభుత్వరాబడి దెబ్బతింటుంది–ప్రభుత్వరాబడి దెబ్బతింటే పల్లె ప్రజలకే కష్టం – పల్లె ప్రజలు కష్టాలుపాలవుతూంటే – ప్రభుత్వానికి నష్టం – పల్లెలకు ప్రభుత్వానికీ గలది అవినాభావసంబంధం. "గ్రామంలో ఏనాడు ప్రజలు స్వయంకృషి అలవరచుకుంటారో ఆనాడు పన్నులభారం తగ్గుతుంది – పురోభివృద్ధి వుంటుంది–" ఇది ఎంతమాత్రము అతిశయోక్తి కాదు.

ఈనాడు గ్రామాలలో జరిగే ప్రతికార్యము – ప్రభుత్వ సహాయంతో జరుగుతోంది – ఆరోగ్య విషయంలో కానీయండి – ఆర్థిక విషయాలలో కానీయండి – వృత్తి – విద్య – వైద్య సౌకర్యాలలో కానీయండి–ప్రభుత్వాధికారుల ప్రబోధంవల్ల జరుగుతున్నాయి–వారుచేసేప్రచారంవల్ల జరుగుతున్నాయి. ప్రభుత్వం బోలెడు డబ్బు ఖర్చుపెట్టి కార్యక్రమాలను నడుపుతోంది. ఈ డబ్బంతా ఎక్కడనుంచి పట్టుకవస్తోంది? ప్రభుత్వం ప్రజలమీద పన్నులు వేసేకదా! ఇట్లా పల్లెప్రజలమీద పన్నులువేసి వసూలుచేసిన సొమ్మును పల్లెప్రజలకే ఖర్చుచేస్తున్నారనుకోండి. కాని ఏమిలాభం? పల్లెవాసులు స్వశక్తిమీద – స్వయంకృషితోను – పనులుచేసుకోవటం లేదు – "ఈ కార్యక్రమాలన్నీ ప్రభుత్వమే నడుపుతోంది – ప్రభుత్వమే నడపాలనికూడా అనుకుంటున్నారు – ఇది తప్పు అభిప్రాయం – ఏగ్రామానికి కావలసిన సదుపాయములు – ఆ గ్రామమే స్వయంకృషితో చేసుకోవాలి – ప్రభుత్వం అజమాయిషీ మాత్రంచేస్తూ వుండవచ్చును. సుశిక్షితులైన గ్రామసేవకులద్వారా సలహాలు యీయవచ్చు. అంతే – ఒండొరులు సహకరించుకొని పనిచేసుకునే అవకాశాన్ని మాత్రమే ప్రభుత్వం కల్గిస్తుంది – ఒక సహకారసంస్థ స్థాపించవచ్చు – గ్రామపంచాయితీని

ఏర్పాటుచేయవచ్చు — శాలభట సంఘాలను — వైద్య సహాయ సంస్థలనీ — నియమించవచ్చు — వీటికయ్యే ఖర్చులు ప్రజలే భరించాలి. ఇందులో సభ్యులుకూడా ప్రజలే వుండాలి.

డబ్బురూపంలోగాని — వస్తురూపంలోగాని — శరీరపరిశ్రమచేసిగాని. (శ్రమదానం) ప్రతి గ్రామస్థుడూ — ఈ సంస్థలలో భాగస్వామియై — సహకరించాలి — సభ్యుడై వ్యవహరించాలి. ఇదీ స్వయంకృషి — దీనినే స్వశక్తిమీద ఆధారపడి సమస్త సౌకర్యాలు చేసుకోవడమంటారు.

ప్రజలందరూ కలిసినప్పుడు ప్రభుత్వంకంటేకూడా శక్తివంతులవుతారు — ప్రభుత్వం తలపెట్టిచేసే కార్యాలకన్నా — ప్రజలు తలపెట్టిన కార్యాలు శీఘ్రకాలంలో నెరవేరుతాయి — కనుక ప్రజలు ప్రతిదానికీ ప్రభుత్వంమీద ఆధారపడకూడదు. ప్రభుత్వం మీద ఆధారపడి జీవించటం స్వాతంత్ర్య లక్షణం కాదు — స్వయంకృషి చేసుకోవడమే స్వాతంత్ర్య లక్షణం — స్వశక్తిమీద ఆధారపడటమే, సర్వదా శ్రేయోదాయకం.




మేఘసందేశం: కర్త; యం. వి. ఆర్. కృష్ణశర్మగారు. ఇది క్రౌనుసైజున 40 పుటలగ్రంథం. వెల ఒక్కరూపాయి. ప్రతులకు: ఆదిత్య ప్రచురణలు, ఆరండలుపేట, గుంటూరు. అని వ్రాయాలి.

దీనికి పరిచయం వ్రాసినపెద్దలు మేఘసందేశానువాదకులనుకొందరిని సర్కారుజిల్లాల వారిని మాత్రమే పేర్కొన్నారు. అందరినీకాదు. తెలిగించిన వారు శతాధికులువుండగా, ఎనిమిదిమంది మాత్రమే వీరిజాబితాకు ఎక్కారు. మరొకచిత్రమేమంటే, ఈ గ్రంథాన్ని ప్రశంసిస్తూ "ఈ ఆంధ్రీకరణమున్యూనాతిరిక్తమై మూలగ్రంథములోని భావములను నరటిపండొలిచియిచ్చిన రీతిని సులభముగా నరిదింపుచున్నది" అన్నారు. "న్యూనాతిరిక్తమయి అరటిపండొలిచిఇచ్చు" నట్టిదెట్లో?

ఇక, ఈ గ్రంథానికి 'అనువాదం' అనిపేరు పెట్టుకుంటే, ఎవరికీ ఏలాటిబాధకంలేదు; కాని అది యెంతవరకు సార్థకమనేదే, గొప్పసమస్య. కొన్నిట కవికులచక్రవర్తి భావాలు, సరిగా, పసిగా అర్థం కాదు. క్లిష్టాన్వయాలు పాఠకుణ్ణి సందేహగర్తంలో పడదోస్తుండు. శబ్దలక్షణదోషాలుకూడా విపరీతంగానేవున్నాయి.

యక్షుండెదనందు యక్షుడాబ్రాణులే, నేయర్థింతు, యాజించి, (యాచించి) గుర్తునుబట్టు, వీడకణ్, లెక్కింపకణ్, శాంతులలుమంగణ్, పంపించు, మదస్ఖలనము, వెదజల్లు,

ఇక ఊతపదాలు, వెతకాల్సిన శ్రమలేకుండానే దొరకుతాయి. మొత్తంమీద ఈ కవిత సంస్కారార్హయయిందని మా విన్నపం.

అభినవదాశరథీ శతకం; కర్త; వల్లభనేని - వెల రెండణాలు - ప్రతులకు లాల్ బ్రదర్స్, ఏలూరు, పశ్చిమగోదావరిజిల్లా - అనివ్రాయాలి.

ప్రఖ్యాతి చెందిన 'వల్లభనేని' - వారివంశంలోని యేకవిగారిపేరు గ్రంథంలో తెలిపివుంటే వీరి ప్రసిద్ధికూడా తెలిసివుండేదేమో. ఈ యిరవైపేజీల శతకంలో సరిగా పందచంపకోత్పలాలువున్నాయి. మకుటంవీరిది కాదు. గోపన్న దాశరథీ శతకంలోనిది.

దీల్లోనిపద్యాలు చాలావరకు సాంఘికరాజకీయ జాతీయభావలను వెల్లడించేవి. అన్యదేశాలూ, కాంగ్రెసుమొదలయిన పక్షాలసాంకేతికాలు విరివిగా ఉటంకించేవి. ధార సరళంకాకపోయినా, శబ్దాలు సులభంగా అర్థమయ్యేటివి. అమితంగా లక్షణవిరుద్ధప్రయోగాలు కనబడుతున్నాయి. కవిగారు స్వోత్కర్షకలవారుగా వూహించటానికి అవకాశాలువున్నాయి. కవిగారితొలికబ్బంగా దీన్ని చదువరులు గ్రహింపగలరని రచనావిధానాన్ని బట్టియెన్నదగినట్లు అగపడుతుంది.

'కా శి క'

# సంపాదకీయములు

## స్త్రీల విద్యాభివృద్ధి

కేరళ, మద్రాసు రాష్ట్రములలోవలె స్త్రీ విద్యాభివృద్ధి ఆంధ్ర రాష్ట్రంలో చెప్పుకోతగినంతగా లేదు. ఇందుకుగల కారణములలో స్థానిక మహిళలకు యిల్లు వదలుట యిష్టంలేక, ఉద్యోగములు చేయాలనే ఆసక్తిలేమి కొన్నికావచ్చును.

స్త్రీల విద్యాభివృద్ధి నుద్దేశించి విద్యాలయములను మాత్రము విరివిగా స్థాపించినచాలదు. విద్య నేర్చుకోడం ఉద్యోగాలు చేయడానికనిమాత్రం కాదనియు, ఉపయుక్తమయిన విజ్ఞానార్జనయే విద్య యొక్క లక్ష్యమని ప్రచారంసాగాలి. అంతేకాక స్త్రీల విద్యా విధానంలో సంగీతసాహిత్యముల లాంటి లలితకళలు, అల్లిక, కుట్టు పనులు, కుటుంబనిర్వహణకు సంబంధించిన విజ్ఞానములాంటివి ప్రధానములై ఆకర్షణీయముకావలెను.

స్త్రీ విద్యాభ్యాసము పురుషుల విద్యావిధానమునకు వేరైనదియై ఉద్యోగావకాశములకే కాక కుటుంబనిర్వహణకు వలయు విజ్ఞాన అనుభవాలను, కళలపట్ల ఆసక్తి ప్రావీణ్యములను ప్రోత్సహించునదిగా నున్నచో కుటుంబజీవనము, తద్వారా సంఘజీవనము సుఖప్రదముకాగలదు.

## స్త్రీల పునరావాసశరణాలయము

ప్రప్రథమంగా ఆంధ్రప్రదేశ్‌లో రాజమహేంద్రవరమునందు కందుకూరి వీరేశలింగం పంతులుగారి పేరిట స్త్రీల పునరావాస శరణాలయమునకు ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ప్రారంభోత్సవముచేసిరి.

ప్రస్తుతం విద్యావిజ్ఞానములు, అందచందాలు, సుగుణసౌశీల్యములున్నను వరకట్నాల పేరాశవలన ఆడపిల్లలకు వివాహంకావడం దుస్తరముగానున్నది. దీనిమూలంగా దీనావస్థలోనున్న ఆడపిల్లలను ఉద్ధరించుటకు, వారి జీవితసౌభాగ్యమును తీర్చిదిద్దుటకు యీశరణాలయము బహుళోపయుక్తముకాగలదని ఆశిద్దాము.

## తిండిగింజల ధరలు

మొత్తంమీద అన్ని జీవితావసరముల ధరవరలు పెరిగిపోతుండగా ఆహార ధాన్యాల ధరలు తగ్గుదలపట్ల కేంద్ర ప్రభుత్వము కొంత ఆసక్తి చూపేసరికి ముఖ్యంగా భూస్వాములకు బాధగా పరిణమించింది.

ఉత్పత్తిదారుడు నష్టపడి ధాన్యమును ప్రజలకు పంచిపెట్టమని ఎవరు అన సాహసించలేరు. కానీ అవకాశవాదులుగా ఆహారధాన్యాలధరలను పెంచేస్తూ ప్రజావసరాలను నిర్లక్ష్యముచేసి యితరత్రా ధాన్యాదులను అధికలాభాలకు అమ్ముటకు ప్రయత్నించుట శోచనీయము.

ఉత్పత్తిదారుల కవసరమగు వ్యవసాయపరికరాలు, ఎరువులు యిత్యాదులు సరసమయినధరలకు అందించవలసిన బాధ్యత ప్రభుత్వముమీదనున్నది. ధాన్యము నిల్వలను గిట్టుబాటుధరలకు ప్రజావసరాలకనుగుణ్యంగా విడుదలచేయక ఉత్పత్తిదారులు స్వార్థమును ప్రదర్శించినచో వారి నదుపులోనుంచుట కూడా ప్రభుత్వధర్మమే కాగలదు.

## శ్రీ హేవళంబినామ సం॥ర భాద్రపద, ఆశ్వయుజమాసములు

| | | | |
|---|---|---|---|
| 1957 సం॥ సెప్టెంబరు నెల | 16 | సో | స 26-2 రో 24-41 |
| | 17 | మం | అ 24-31 మృ 25-4 |
| | 18 | బు | న 21-46 ఆర్ద్ర 24-5 తిథిద్వయం |
| | 19 | గు | ద 17-54 పున 21-58 త్యా 3-48 |
| | 20 | శు | ఏ 13-4 పుష్య 18-55 |
| | 21 | శ | ద్వా 7-27 ఆశ్లే 15-6 |
| | 22 | ఆ | త్ర 1.17 ఏవ్యం 53.31 మఖ 10.47 మాసశివరాత్రి |
| | 23 | సో | ● అమా 48-19 పూఫ 46-12 మహాలయామావాశ్య |
| | | | **ఆశ్వయుజమాసము** |
| | 24 | మం | శుపా 41-57 ఉఫ 1-37 హ 55-40 శరనవరాత్రారంభం-కలశస్థాపనం |
| | 25 | బు | విది 36-11 చిత్త 53-30 |
| | 26 | గు | త 31-11 స్వా 50-36 త్యా 3-49 |
| | 27 | శు | చ 27-6 విశా 48-42 |
| | 28 | శ | పం 24-8 అనూ 43-56 ఉపాంగ లలితావ్రతం |
| | 29 | ఆ | ష 22-22 జ్యే 48-25 తిరుపతి వేంకటేశ్వర గరుడోత్సవం |
| | 30 | సో | స 21-50 మూ 50-4 సరస్వతీపూజ, దేవీత్రిరాత్రవ్రతం |
| 1957 సం॥ అక్టోబరు నెల | 1 | మం | అ 22-32 పూషా 52-52 దుర్గాష్టమి |
| | 2 | బు | న 24-25 ఉషా 56-46 త్యా 4-16 మహార్నవమి, గాంధిజయంతి |
| | 3 | గు | ద 27-18 శ్ర 60-10 త్యా 4-21 విజయదశమి |
| | 4 | శు | ఏ 31-0 శ్ర 1 42 |
| | 5 | శ | ద్వా 35-18 ధ 7-9 త్యా 4-24 |
| | 6 | ఆ | త్ర 39-55 శత 13-0 త్యా 4-24 |
| | 7 | సో | చతు 44-34 పూభా 18-59 |
| | 8 | మం | ○ పౌ 49-2 ఉభా 24-52 |
| | 9 | బు | కృపా 52-59 రే 30-20 |
| | 10 | గు | విది 56-10 అశ్వ 35-10 |
| | 11 | శు | త 58-23 భ 39-8 |
| | 12 | శ | చ 59-27 కృ 42-2 అమృతయోగం |
| | 13 | ఆ | పం 59-17 రో 43-47 త్యా 4-2 |
| | 14 | సో | ష 57-49 మృ 44-17 |
| | 15 | మం | స 55-6 ఆర్ద్ర 43-33 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




# 57 ఏళ్లగా ఖ్యాతి గాంచినది.

వనితకు ఏ వయస్సైనా లోధ్ర మంచి పుష్టి
నిచ్చే టానిక్. ఆరోగ్యానికి. ఆనందానికి లోధ్రను
మించిన టానిక్ లేదు. కెమిస్టు
లందరి వద్ద దొరుకుతుంది.

లోధ్ర స్త్రీల దివ్యౌషధం

కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.
రాయపేట - మదరాసు - 14.






ఆంధ్ర ప్రదేశ్, ఒరిస్సాకు ఏజంట్లు :
శీతారాం జనరల్ స్టోర్సు, విజయవాడ & సికిందరాబాద్, బరంపురం

Lodhra Press, Madras- 14.